చీరాల ఎన్నిక విశేషాలు

Regd. No. M. 3824

# నవశక్తి

ఆంధ్రరాష్ట్ర కాంగ్రెసు సోషలిస్టు పార్టీ పత్రిక

సంపాదకవర్గం: [illegible] (సంపాదకుడు). [illegible] వెంకట రామయ్య.

సంపుటం 1 | బుధవారం 30-11-38 విజయవాడ | సంచిక 47



ఫాసిస్టుల సహాయంతో సోవియట్ యూనియన్‌పై కుట్రలు పన్నుతున్న ఛాంబర్లేన్.

# వివిధరాజకీయాలు

## ఎసంబ్లీలో ఇన్కంటాక్సు బిల్లు

భారతీయుల విదేశ వ్యాపారానికి నష్టము కలిగించడానికి, ఇండియా ప్రభుత్వం ఢిల్లీ ఎసంబ్లీలో ఒక బిల్లు ప్రతిపాదించింది. నేటి ఇన్కంటాక్సు చట్టం ప్రకారము, ఇతర దేశాలలో వ్యాపారంచేస్తూ సంపాదించిన ఆదాయాన్ని ఇండియాకు తెచ్చుకున్నప్పుడు మాత్రమే, దాని మీద పన్ను చెల్లించాలి. కాని, యిప్పుడు ప్రవేశ పెట్టబడిన బిల్లు ప్రకారము, ఆ ఆదాయము స్వదేశానికి చేరినా, చేరకపోయినా, గవర్నమెంటు పన్ను విధిస్తుంది. ఇంతే కాదు, బిల్లులో 49 వ క్లాజు ప్రకారం, ఇండియాలో వ్యాపారం చేసే విదేశీ కంపెనీలకు ప్రతియేటా సుమారు 1,30,00,000 లు మిగిలేలాగు పన్ను విధించబడుతుంది. ఇంగ్లండులో వ్యాపారము చేసే ఇండియన్ కంపెనీలకు కూడా ఇట్టి మినహాయింపులే చేశాము అని ప్రభుత్వ సభ్యులు వాదిస్తున్నారు. ఐతే, వీటివల్ల మనకు 3 లక్షలరూపాయలు మాత్రమే వస్తుంది, కాబట్టి, యీ క్లాజు రద్దు చేయబడాలంటూ వల్లభాయి పటేల్‌గారి సలహాపై అన్ని కాంగ్రెసు మంత్రివర్గాలూ గవర్నమెంటును కోరాయి. బిల్లు ఎసంబ్లీలో తీవ్రమైన చర్చలకు గురి అవుతోంది. మితవాద పార్టీకి చెందిన కొవాస్జీ జహంగీర్ సహితం కాంగ్రెస్ సభ్యులతో ఏకీభవించి, అనేక క్లాజుల్ని వ్యతిరేకిస్తూ మాట్లాడాడు. కాంగ్రెస్ సవరణలన్నింటినీ వైస్రాయి నిరాకరించాడు. బెంగాల్ మంత్రివర్గం 49 వ క్లాజు ఉండితీరాలని లేఖ పంపింది. యూరపియన్ సభ్యుల వోట్లతో మెజారిటీ సంపాదించిన హక్ మంత్రివర్గము మరో విధముగా ఎందుకు చేస్తుంది?

## బెంగాల్ మంత్రుల తతంగం.

ఏ విధంగానైనా తమ మంత్రి పదవుల్ని నిలబెట్టుకోవటానికి బెంగాల్ ప్రధాని హక్ తన ప్రతికూల పక్ష నాయకులయిన తమీజుద్దీన్‌ఖాన్, శ్యాంసుద్దీన్ అహమ్మద్ అనే యిద్దర్ని కొత్తగా మంత్రివర్గంలో చేర్చుకున్నాడు. కాని, వీరిద్దరూ తమ పార్టీ అనుచరుల్ని సంప్రతించకుండా మంత్రి పదవుల్లో చేరడము వల్ల, వారిలో అనేక మందికి అసంతృప్తి యేర్పడింది. మంత్రులు అనుసరిస్తూన్న జాతీయ ప్రతికూల వైఖరి వల్ల అనేకమంది సభ్యులలో ప్రతికూల భావము బయల్దేరుతూందనీ, వచ్చే ఎసంబ్లీ సమావేశము నాటికి తప్పక కాంగ్రెసుయొక్క బలం హెచ్చి, కాంగ్రెసు— మిశ్రమ మంత్రి వర్గము ఏర్పడగలదని సుభాష్‌బోసు అభిప్రాయం.

## అస్సాం యూరపియన్లు—కాంగ్రెసు.

బెంగాల్ యూరపియన్ల వైఖరీ, అస్సాం యూరపియన్ల వైఖరీ ఒక్కటే. అస్సాం యూరపియన్ గ్రూప్ కార్యదర్శి అయిన హాకెన్‌హల్ సంతకంతో 11-10-38 వ తేదీ గల రహస్యపు సర్క్యులర్ ఒకటి వారం రోజుల క్రితము బయటపడింది. అస్సాం కాంగ్రెస్ పార్టీ సభ్యులు గత 18 నెలలలోను ఏ విధముగా స్థానిక సంస్థలలో యూరపియన్ల ప్రాతినిధ్యాన్ని తగ్గించడానికీ, యూరపియన్లకు చెందిన టీ తోటల్లో పని చేసే కూలీల స్థితిని బాగుచేయడానికీ, తీవ్ర ప్రయత్నాలు చేశారో, ఏ విధముగా పూర్వపు సాదుల్లా మంత్రివర్గం కాంగ్రెసును ఎదుర్కొందో ఆ సర్క్యులర్‌లో వివరించబడియుంది. ఇందువల్లనే యూరపియన్లు నేడు కాంగ్రెస్ పార్టీని వ్యతిరేకిస్తున్నారని స్పష్టముగా తెలియజేయబడిఉంది.

కొద్ది రోజుల క్రితము, అస్సాము యూరపియనులనుగురించి సుభాష్‌బోసు చెప్పిన మాటలు నిజమని ఇప్పుడు రుజువయింది.

'అస్సాము జమీన్‌దార్లు యూరపియన్లను మించిపోతున్నారు. హైలాకండీ పట్టణములో హీరేంద్ర చక్రవర్తి అనే శాసనసభ్యు డున్నాడు. అత డొక పెద్ద జమీన్‌దారు, కాంగ్రెసు వ్యతిరేకి. అతన్ని కాంగ్రెసు పక్షములో చేరమని అడుగుటకు వెళ్ళితే, రవీంద్ర ఆదిత్య (కాంగ్రెస్ ఎమ్. ఎల్. ఏ.), మోతీలాల్ జాగీర్దార్ (జిల్లా కాంగ్రెస్ కమిటీ కార్యదర్శి) మొదలైన ప్రముఖుల్ని యింట్లో పెట్టి క్రూరముగా కొట్టించాడు.

## ముస్లిమ్ లీగ్—హైదరాబాదు కాంగ్రెసు

హైదరాబాద్ సంస్థానంలో యీ మధ్యనే బయల్దేరిన కాంగ్రెసు ఉద్యమానికి కూడా విరోధులు ఒక్కరొక్కరే లేస్తున్నారు. ఈ ఉద్యమము మహమ్మదీయులకు తీరని అపకారము చేస్తున్నది కాబట్టి, దాన్ని ఎదుర్కోవడానికి సకల ప్రయత్నాలూ చేయవలసిందంటూ నాగపూర్‌లో సమావేశమైన మధ్య రాష్ట్ర ముస్లిమ్ లీగ్ మహాసభ తీర్మానించినది.

శాంతియుతముగా సాగుతూన్న సత్యాగ్రహోద్యమాన్ని ఏవిధముగానయినా రెచ్చగొట్టడానికి చేస్తూన్న సన్నాహాలు, యివన్నీ.

## బెంగుళూరులో రాజాజీ హిత బోధ

ఈ విధముగా, కాంగ్రెసేతర రాష్ట్రాలలో జాతీయ శక్తులకూ, జాతీయ విద్రోహ [illegible]కూ మధ్య తీవ్రమైన సంఘర్షణలు జరుగుతోంటే, ఇటు కాంగ్రెసు రాష్ట్రాలలో మంత్రులు రోజు రోజుకూ విజృంభిస్తూన్న ప్రజా చైతన్యాన్ని చక్కగా ఉపయోగించుకోవడానికి మారు అది చూచి భయపడుతున్నారు. మన రాజాజీ మైసూరు యూనివర్సిటీ యూనియన్‌లో విద్యార్థుల యెదుట ఉపన్యసిస్తూ, యీ విధముగా పలికాడు: "విద్యార్థుల తరిఫీదును గురించి నిర్ణయించవలసింది విద్యార్థులు కాదు, పెద్ద వారే యిందుకు అర్హులు, హక్కుదార్లు—వారికి తెలివి తేటలు ఉన్నా సరే, లేకపోయినాసరే"

ఒక వైపు, తుపాకిని చేతబట్టి, సంపూర్ణ స్వాతంత్ర్యము కొరకు చైనా విద్యార్థులు హోరాహోరిగా యుద్ధము చేస్తూంటే, ప్రక్కనే ఉన్న మన దేశములో ఒక కాంగ్రెసు ప్రధాని యుక్త వయస్సు వచ్చిన కాలేజి విద్యార్థుల్ని చంటి పిల్లల మాదిరిగా చూడ్డంవల్ల స్వరాజ్య పోరాటానికి తీరని అపకారము చేసిన వాడౌతున్నాడు.

ఇంతేకాదు, రాజాజీ యీవిధముగాకూడా అన్నారు: "సాధారణముగా, ప్రజల అర్హతల్ని బట్టే ప్రభుత్వాలు కూడా మారుతూ ఉంటాయి. ఆ తమాషా వాటిల్లో ఉంది. ప్రజలు సరియైన తరిఫీదు పొంది, మంచివాళ్ళుగా ఉంటే, ప్రభుత్వము ఏదైనప్పటికీ దాన్నుంచి మనకవసరమైన మంచిని పొందవచ్చు."

అతి ప్రమాదకరమైన యీ భావాలు ఒక కాంగ్రెసు మంత్రి నోటి నుంచి వస్తూంటే, వింటూ సహించగల సామ్రాజ్య వ్యతిరేకి ఎవడుంటాడు? సామ్రాజ్య వాదుల మాటల్నే పల్లిస్తూన్న రాజగోపాలాచారి గారి ఈ విపరీత వైఖరిని ప్రజలు యెదుర్కోవలసి యుంటుంది. లేదా, పవిత్రమైన కాంగ్రెసు సంస్థకు ద్రోహము చేసినవాళ్ళమవుతాము.

## బొంబాయి ప్రధాని, వర్గ సమస్య

విద్యార్థుల యెదుట మదరాసు ప్రధాని వెల్లడించిన దృక్పథాన్నే కార్మికుల యెదుట బొంబాయి ప్రధాని పల్లించాడు. "వర్గ సమస్యను గురించి కాంగ్రెసు సిద్ధాంతము, గాంధీగారి సిద్ధాంతము, ఒక్కటే; అదే వర్గ సామరస్యము," అంటూ బి. జి. ఖేర్ బొంబాయిలో ఒక కార్మిక సభలో ఉపన్యసించాడు.

జీవితము యొక్క అనేక క్లిష్ట సమస్యల మీద కొన్ని దృఢ నమ్మకా లున్నాయి, అవి అన్నీ కాంగ్రెస్ కాంగ్రెసు అభిప్రాయాలేనని బహిరంగముగా చాటడము, ఖేర్ వంటి సుప్రసిద్ధ కాంగ్రెస్‌వాదికి సాహసమే. కార్మికుల హక్కులకూ—యజమాని హక్కులకూ మధ్య సామరస్యము ఉండవచ్చునని మహాత్ముని వాదన. కాని యీనాటివరకూ కాంగ్రెసు తన నిశ్చితాభిప్రాయాన్ని ప్రకటించలేదు. వర్గ పోరాట సిద్ధాంతంలో నమ్మకము ఉండి, తదనుసారము కృషిచేస్తున్న అఖిల భారత ట్రేడ్ యూనియన్ కాంగ్రెసును జాతీయ పోరాటము నుంచి దూరము చేయడానికే ఉపయోగిస్తాయి, ఖేర్‌గారి మాటలు.

## ఇదే మార్గము!

లాహోరులో జరిగిన పత్రికా రచయితల సమావేశంలో ఫెడరేషన్‌ను గురించి చర్చిస్తూ, సుభాష్ బోసు యీ విధముగా పలికాడు: "మన మొట్టమొదటి కర్తవ్యము ఏమంటే, చట్ట సమ్మత విధానము వైపుకు అర్రులు చాచే వైఖరిని అరికట్టాలి. కొన్ని ప్రదేశాలలో, కొందరియందు, ఇది స్పష్టముగా కనబడుతోంది."

పై వాక్యములో యదార్థము ఎంతో ఉంది. ముఖ్యముగా మన రాజధానిలో ప్రెస్ అక్టు, రాజద్రోహ నేరాలు, గ్రంథ నిషేధాలు, రోజు రోజుకీ విజృంభిస్తున్నాయి. అంతేకాదు. మన రాజగోపాలాచారి వీటిని ఎంతో చమత్కారముగా సమర్థిస్తున్నాడుకూడా! స్వవినాశకరమయిన యీ వైఖరిని మనము అరికట్టగలిగినప్పుడే, ఫెడరేషన్‌నికూడా ధిక్కరించగలము. అప్పుడే, స్వరాజ్య పోరాటము వృద్ధి చెందుతుంది. కాంగ్రెసు ప్రతిష్ఠని కాపాడ్డానికికూడా యిదే మార్గము.

30—11—38 బుధవారం

## జమీందారీ విచారణ సంఘ నివేదిక

రైతు అంచను ఎదురు జూస్తున్న జమీందారీ విచారణ సంఘ నివేదిక యీ నెల 28 వ తేదీన శాసన సభా సభ్యుల కందజేయబడింది. ఈ సూచనల నాధారము చేసుకొని తయారు చేయబడిన చిత్తు చట్టము కూడ ప్రకటింపబడినది.

నివేదికలోని కొన్ని ముఖ్యమైన సూచనలు యివి:

1. భూమియందు సమస్త హక్కులు రైతువే గాని జమీందారువి గావు. జమీందారు ప్రభుత్వము తరపున వసూలు చేయు ఏజెంటు మాత్రమే.

2. 1802 వ సంవత్సరపు పర్మనెంటు సెటిల్మెంటుకు ఒక సంవత్సరమునకు పూర్వమున్న శిస్తు రేట్లనే ఖాయపర్చవలెను. అటుపై విధించబడిన సకల విధము లయిన శిస్తు పెంపుదలలు రద్దుచేయబడవలెను.

3. (1) జలాధారములైన చెరువులు, కాలవలు మొదలగు నీటి పారుదల వసతులు అన్నీ రైతులవేగాని జమీందారులవి గావు.

(2) ప్రస్తుతము నీటి వసతులకు సంబంధించిన ఎస్టేటు లాండు ఆక్టులోని సెక్షనులను రద్దుపరచి వాటి స్థానే రైతులకు నీటి వసతులపైన నున్న హక్కులను ఖాయపర్చుటకు స్పష్టముగా కొత్త ఆక్టులో నిర్వచింపబడును.

(3) నిర్ణీత కాలములో జమీందారు నీటి పారుదల వసతులను గూర్చి శ్రద్ధ తీసుకొని బాగుచేయించక పోయిన ప్రభుత్వమే బాగు చేయించి అందులకైన ఖర్చులను జమీందారులనుండి వసూలు చేయవలెను.

(4) సాధ్యమైతే ఒక జలాశయ రక్షణనిధిగూడ జమీందార్లనుండి వసూలు చేయవలెను.

(5) ప్రస్తుతము చెడిపోయి వున్న జలాశయములను బాగు చేయించుటను గూర్చి జమీందార్లు శ్రద్ధగైకొనక పోయిన ప్రభుత్వమే దాని బాధ్యత గైకొని దానికైన ఖర్చులను జమీందార్ల నుండి వసూలు చేయవలెను.

4. (1) రైతులు పర్మనెంటు సెటిల్మెంటుకప్పుడు అనుభవించుచున్న పోరంబోకలు, తోపులు, పుంతలు, కొండ, అడవి మొదలగు ఫలసాయమన్నీ రైతులే వెనుకటివలె అనుభవించ వలెను. వాటిపై జమీందార్లకు ఎట్టి హక్కూ లేదు.

(2) రైతులు 1802 వ సంవత్సరపు నాటి సెటిల్మెంటప్పుడు సాముదాయకముగ అనుభవించుచున్న పచ్చిక బయళ్లు, అడవులు, బంజరు భూములు, కొండలు, మొదలగున వన్నీ రైతులే అనుభవించ వలెను. వాటిపై గూడ జమీందార్లకు ఎట్టి హక్కూ లేదు. అడవులనుండి కట్టె, కలప, కంప తెచ్చుకొను హక్కు గూడ అప్పటిమాదిరిగనే ఉండవలెను.

5. శిస్తు వసూళ్ళు:—శిస్తు బకాయికై ఏ రైతుని అరెస్టు చేయరాదు. జప్తు వేలం హక్కులు జమీందార్లనుండి తొలగించవలెను. పంటలపై శిస్తు వసూలుకై మొదటి ఛార్జీ హక్కుండును. శిస్తు మొత్తమునకు చాలిన ఆస్తిని మాత్రమే జప్తుచేయుటగాని, వేలం వేయుట గాని జరుగవలెను. జమీందార్లకున్న అసాధారణ శిస్తు వసూలు హక్కులను తొలగించవలెను. పంటలు పోయినప్పుడు శిస్తు రిమీషన్లు నిర్బంధముగా యిచ్చే ఏర్పాటు చేయవలెను.

6. (1) రైతుల స్వాధీన మందున్న భూమి నంతను సర్వే చేయించి అందులకగు ఖర్చు జమిందారు, ప్రభుత్వము భరించ వలెను.

(2) లోగడ పట్టాలు రద్దు చేసి నూతనముగా పర్మనెంటు సెటిల్మెంటుకు పూర్వమున్న రేట్లను వుదహరించి మొత్తం రైతు స్వాధీన భూమి కంతకు ప్రత్యేక పట్టాలు జమిందారే యివ్వ వలయును. ఈ పట్టాలు యిప్పటివలె ముచ్చిలికాలు, పట్టాలే రైతులకు జమీందార్లకు మధ్య బాధ్యతను తెలియచేయును. పర్మనెంటు సెటిల్మెంటు తరువాత సాగుకు తేబడిన భూములకుగూడ యిదే విధంగా పట్టాలు యివ్వవలయును.

7. అక్రమ శిస్తులు:—చట్ట ప్రకారం విధించబడిన శిస్తు తప్ప మరి యే యితర నజరానాగాని శిస్తులుగాని వసూలు అట్లు చేసిన అపరాధము విధించవలెను.

8. ప్రస్తుతమున్న యస్టేటు లాండు చట్టమును పూర్తిగ రద్దుచేసి పై సూచనలనుసరించి "ఇనెస్టీ లాండు రెవెన్యూ బిల్లు" అనే పేరుతో యొక నూతన చట్టము చేయబడును.

ఈ పై సూచనల నాధారముగ గొని చేయబడు చట్టము యిదివరకున్న యే చట్టము వలనా గల్గని న్యాయము రైతుకు గల్గుననుటకేమీ సందేహములేదు. ఇందులకు రెవిన్యూ మంత్రిగార్కి రైతులందరూ తప్పక కృతజ్ఞత చూపుదురు. కాని యివి యింకనూ రైతులయొక్క కనీస కోర్కెలను యీడేర్చుట లేదు.

భూమి కంతకూ రైతే హక్కుదారుడు అన్న సూత్రమును అంగీకరించుట సంతోషము, దాని వలన రైతులకు సమస్త జిరాయితీ హక్కులు సంక్రమించును.

నివేదికలో రైతులకు చాల భంగకరమైన సూచన ఒకటి ఉంది. ఈ ఆక్టు పర్మనెంటుగా సెటిల్మెంటు చేయబడిన యస్టేట్లకు, అందున్న రైతులకే వర్తించుతుందని అనడము చాల అన్యాయము. మన రాజధానిలో 50 లక్షలకు పైగా ఈనాం దారీ రైతులున్నారు. ఇవి గాక పర్మనెంటు సెటిల్మెంటు క్రిందికి రాని మొఖాసాలు కొన్ని గలవు. మొఖాసా ముఠా రైతులు గూడ బాధితులే. అందుచేత నూతన చట్టమును యే మినహాయింపు లేక అన్ని యస్టేట్లకునూ, వర్తించేటట్లు చేయాలి.

జమీందార్లకున్న స్వంత కమతం భూముల విషయమై నివేదికలో యేమీ చెప్పియుండలేదు. స్వంత కమతములు పెట్టుకొని రైతుల పెట్టిబాకిరీ చేయించుకొని చెరువుల క్రింద, కాలువల క్రింద వున్న స్వంత కమతముల భూములు తడిసే అంత వరకూ రైతులకు నీరు యివ్వకను లేదు. జమీందార్లు ప్రభుత్వమునకై శిస్తువసూలు చేయుటకు మాత్రమే ఏర్పడిరని అంగీకరించినప్పుడు, నానాటికీ హెచ్చుతూ వున్న శిస్తు బకాయిలకై వేలంద్వారా పొందిన కమతములు, గ్రామసాముదాయక భూముల ఆక్రమణ ద్వారా ఏర్పడిన కమతములు, రద్దు చేయక పోవడములో సబబు లేదు. అందుచే కమతములను గూడ రద్దు చేసి ఆ భూములను ప్రభుత్వము వశపర్చుకొని పేద ప్రజలకు సాగు నిమిత్తమై సహకార పద్ధతులపై యిచ్చునట్లుగా బిల్లులో అవకాశముండ వలెను.

1802 పర్మనెంటు సెటిల్మెంటు నాటి శిస్తులను అమలులోనికి తీసుకు రావడానికి అభ్యంతరం యేమీ లేదుగాని ఆ కాలపు వివిధ రకములయిన శిస్తులను లెక్క కట్టి అమలునకు గొనివచ్చుటలో చాల ఆలస్యమైపోవును. అందుచేత యిప్పటి నుంచే త్వరగా ప్రభుత్వమే యీ పనికి పూనుకొని యొక సంవత్సరములోపల పని పూర్తి అయ్యేటట్లు చేయాలి. అదిగాక బిల్లు శాసన సభలో ప్రవేశపెట్టి నప్పటి నుండి అమలులోనికి వచ్చునని ప్రకటించిననే తప్ప బిల్లులోని సౌకర్యములు రైతులు పొందజాలరు.

నీటి పారుదల మరమ్మతు విషయము జమీందార్లకు వదలుట అన్యాయము. జమీందార్లు చేయజాలకపోయిన కలెక్టర్ల ద్వారా మరమ్మతు చేయించుకొను హక్కు యిప్పుడూ వుంది. అసలు చెరువులమొక్క నీటి పారుదల పరిపాలనను ప్రభుత్వమే తీసుకొని దానికయిన ఖర్చును జమీందార్లనుండి ప్రభుత్వమే వసూలు చేయునట్లు వుంచిననేగాని ప్రస్తుతము జమీ ప్రదేశములలోని నీటి పారుదల వసతులు బాగుపడవు: అందువలన నిర్దిష్టముగ నీటి పారుదల పరిపాలనా హక్కు ప్రభుత్వమే తీసుకొనునట్లున్నూ, పంచాయతీ లేర్పడ్డచోట పంచాయతీలకే యీ అధికార మిచ్చునట్లు అవకాశ ముండవలెను.

సాముదాయక భూములు, అడవులు బంజరులయందు రైతులకున్న అనాది హక్కులే కలిగింపబడినవి. కాని యీ నిర్వచనము యింకా స్పష్టముగా వుండాలి. శిస్తు వసూలుగూర్చి చేయబడ్డ సూచనలలో యొక పెద్ద లోపమున్నది. శిస్తు వసూలు చేయు అధికారము జమీందార్ల క్రిందనే వుంచబడవలన రైతులకు చట్ట సౌకర్యములున్నప్పటికి అనేక అక్రమ వసూళ్లు చేయుటకు అవకాశమునంది. ఇట్టి అక్రమములనుగూర్చి రైతు కోర్టు ద్వారా ఎల్లప్పుడు కోర్టుకెక్కి న్యాయము పొందజాలడు. అందులకై యిట్టి అక్రమములు యికముందు జరుగకుండ యీ శిస్తు వసూలును గ్రామములోని ప్రభుత్వ ఉద్యోగులే చేయు యేర్పాటు ఉండవలయును.

జమీందారుల జప్తు, వేలం హక్కులను తొలగించుట సంతోషమే. రైతు కుటుంబ పోషణకై కనీస ఆస్తి జప్తు వేలము జరుగకుండుటకు న్యాయంగా చేయవలెను.

పట్టాల విషయములలో జమీందార్లే పట్టాలివ్వవలెనని సూచించారు. కాని నిర్బంధముగా యివ్వవలసిన యేర్పాటు వున్నప్పటికిని యిది అమలు జరుగుట చాల కష్టము. జిల్లా కలెక్టరే రైతువారీ యేరియాలవలెనే పట్టాలను జమీన్ రైతులకు యిచ్చి ఆ పట్టాలను గుర్తించవలెనని శాసించవలెను. పట్టా ట్రాన్స్ఫర్లు కూడ కలెక్టరే చేయించునట్లు యేర్పాటు చేయించవలెను.

సర్వే సెటిల్మెంటు, వాటికై తగిన గ్రామరికార్డులు ఉంచడంలో నివేదికలోని సూచనలు బాగుగనే ఉన్నవి. ముఖ్యముగ సర్వే నిర్బంధముగ చేయించి దానికైన ఖర్చులను జమీందారు ప్రభుత్వం భరించాలని సూచించడం చాల న్యాయముగావుంది. ఇది ఎంతవరకు న్యాయమును కలుగ జేయుచున్నప్పటికిని నివేదిక లోపభూయిష్టముగానే వుంది. ముఖ్యంగా శిస్తు వసూలు చేయు విధానము, నీటి పారుదల పరిపాలనలగూర్చి చేయబడిన సూచనలు యిదివరకున్న హక్కులకన్న హెచ్చు హక్కులను రైతులకు సంక్రమింపజేయుటలేదు.

ఈ చట్టమును పర్మనెంటు సెటిల్మెంటు చెందని యినాము, ముఖాసా యినారా రైతులకు వర్తింప జేయాలి. లేనిచో ఈనాందారులకు, ఈనాం రైతులకు జరుగుచున్న పోరాటములు నానాటికి అభివృద్ధి అయిపోవును. రైతుస్థితి ఇప్పటికన్న అధ్వాన్నమగునని చెప్ప సాహసించుచున్నాము. కాన పై సూచనలకు తోడు మా సూచనలను ప్రభుత్వము గుర్తించి రైతులకు న్యాయము కలుగచేయగలదని ఆశించుచున్నాము, ఇందులకై రైతు సంఘాలు, కాంగ్రెసు సంఘాలు పై సూచనలతోగూడిన బిల్లు చట్టమయ్యే వరకూ కృషి చేయాలని కోరుచున్నాము.

ఈ నివేదికను గూడ జమీందార్లు, జాతీయ విద్రోహులు అనేక ఆటంకములు కలుగజేయుదురు. ఈవిషయములో పూర్తిగ కాంగ్రెసు ప్రభుత్వమునకు రైతులందరు బాసటగా నిలబడాలి. అందులకు తగిన కార్యక్రమమును జరుగబోయే డిసెంబరు 4 వ తేదీ రైతుసంఘాలు సంయుక్త సమావేశంలో నిర్ణయించాలి. తీవ్రి ఆందోళనను ఇప్పటినుండీ ప్రారంభించాలి.



# చీరాల ఎన్నికలలోని యదార్థ పరిస్థితులు

(మా ప్రత్యేక విలేఖరి)

పోర్టివ్ల రిపోర్ట్ల ప్రకారం యజ్ఞనారాయణ గారిని యూనియన్ ప్రెసిడెంటు గిరీ నుంచి తొలగించారు కంపెనీ, గవర్నమెంటు యూనియన్ వర్కింగు కమిటీ మెజారిటీ కలసి. ఈ రాయబారాల్లో కలిగించుకొన్న శ్రీ దేశభక్త కొండా వెంకటప్పయ్య పంతులుగారికి యూనియన్ ప్రెసిడెంటుగా ఉండదగిన వ్యక్తిని సూచించమని ఎగ్జిక్యూటివ్ కమిటీవారు అధికారం యిచ్చారు. మొదట జిల్లా కాంగ్రెసు వర్కింగు కమిటీవారికి అధికారమిస్తూ ఉత్తరము వ్రాశారు; వారు విచారించే లోపలనే దేశభక్తుడికి అధికారం యిచ్చారు. దేశభక్తుడికి అధికారం యిచ్చింది కూడా ఒక్క ప్రెసిడెంటును సూచించమనే; తరువాత ఇంకో కమిటీ మీటింగులో వర్కింగు కమిటీని అంతనూ గూడ సూచించమని అధికారం యిచ్చామని అన్నారు.

నవంబరు 7 వ తారీకున జరిగిన యూనియన్ వర్కింగు కమిటీ మీటింగులో పంతులుగారిని 'అయ్యా మీరు పేరు లిస్తారే వారందని మేం తప్పకుండా పెట్టుకోవాలా' అంటే 'నేను పేర్లు సూచించే వాడినేకాని మీ యిష్టం లేకపోతే ఇంకొకర్ని పెట్టుకోవచ్చు' అన్నారు పంతులుగారు.

యజ్ఞనారాయణగారి మీద విశ్వాస రాహిత్య తీర్మానం పెట్టారు వర్కింగు కమిటీవారు, యజ్ఞనారాయణగారు కూడ వెంటనే రాజీనామా యిచ్చారు. కాని యూనియన్లో ఉన్న పని వాళ్లందరు, యజ్ఞనారాయణగారిని అన్యాయం చేసి విశ్వాసంలేదని తీర్మానంతో వెళ్ళగొట్టారని ఇందుకు కంపెనీ, గవర్నమెంటు కూడా తోడైనారని అభిప్రాయ పడుతున్నారు. ఇందుకు ముఖ్యంగా వర్కింగు కమిటీలో శెక్రటరీ బూదరాజు నరశింహారావుగారు కారకులని నమ్ముతున్నారు. ఇలా నమ్ముతున్న పనివాళ్ల కొందరు వీరివలె అభిప్రాయములో ఉన్న వర్కింగు కమిటీ మెంబర్లు కొందరు పంతులుగారితో "అయ్యా, మా లేబరు కెవ్వరికి ఇష్టం లేదు. బూదరాజు నరశింహారావు గారంటే, అయన్ని మట్టుకు పెట్టవొద్దండి బాబు" అని చెప్పారు.

పంతులుగారు 9వ తారీకుకే పేర్లు చెప్పుతామన్నారు. కాని చెప్పలేదనుకున్నారు. అయితే వర్కింగు కమిటీలో ఉన్న పెద్ద గుమాస్తాలు కొందరు, "వెంకటప్పయ్య పంతులుగారికి సర్వాధికారం యిచ్చాం కాబట్టి ఆయన చెప్పిన మనుష్యులను పెట్టుకోవాలనేందేనని, ఆయన నరసింహారావుగారు శెక్రటరీగా ఉండాలంటే ఉంచుకోవాలని, అదిగాక అందరు కొత్తవాళ్ళయితే ఎట్లా, హీనం శెక్రటరీ అయినా పాతవాడుంటే గాని పని సాగదు. కొత్తవాళ్ళకు అ కళింపుగావటం కష్టం" అని ప్రచారం చేశారు.

13 వ తారీకున కంపెనీవారు కచ్చెబట్టి పనిలో నుంచి తొలగించిన కూలీ సోదరు ఢొకటు గుంటూరు వెళ్ళి "ఏమండీ, మీరు చీరాల రావాలి. కొండా వెంకటప్పయ్యగార్ని ప్రెసిడెంటును ఎవర్నో చేస్తారు, మా లేబరంతా సోషలిస్టుల్లో మిమ్మల్ని శెక్రటరీగా పెట్టుకోవా లనుకున్నాం. మిమ్మల్ని మా లేబరంతా రావాలనుకుంటున్నారు. మీరెప్పు డొస్తారని" శివయ్యగారితో అన్నారు. శివయ్యగారు 18 వ తారీకు మధ్యాహ్నానికి చీరాల వెళ్ళారు.

అప్పుడే వర్కింగు కమిటీలో ఉన్న గుమాస్తా సోదరుడొకరు కుశల ప్రశ్నలైన తరువాత అడిగినప్పుడు "ప్రెసిడెంటు కాళిదాసు గారిని నిర్ణయించారు. శెక్రటరీ ఇతరుల సంగతులు బాగా తెలియవు. అయినా ఆఫీసులో పాతవాడొకడైనా ఉండాలి." అన్నాడు. "ఐతే నరశింహారావుగారిని పెట్టుకుంటారా" అన్నాను "అః ఆయన పెట్టుకోమంటే పెట్టుకోవాల్సిందే" అన్నాడు. ఈయనగారి ధోరణిలో మార్పుంది, పంతులుగారు ఈ విషయంలో దిక్టేటరేనని ఆయన ఉద్దేశ్యం, "ఇదంతా కూలీలకు తెలుసునా?" అన్నాను, "లేదు. ఇంకా పబ్లికు గాలేదు. అంతా రహస్యమే. ఎక్జిక్యూటివ్‌లో కొందరికి దప్ప" అన్నారు.

19 వ తారీకు సాయంత్రము కూలీలలో పెద్దలను కలుసుకున్నాను, "మాకు కాళిదాసు గారు ప్రెసిడెంటుగా ఒద్దు. ఆయన పిరికి. కాంగ్రెసులో మంచిపేరు లేదు. ఆయన్ను జిల్లా బోర్డుకు నిలబెట్టవద్దని తాలూకా కాంగ్రెసు కమిటీ ప్యానుచేసింది. ఆదిగాక ఆయన మేడ మీద కూచుంటాడు ఆయనకంతా డబ్బుతోటే పని. ఆయన మా కెందుకండి ప్రెసిడెంటు. మాకింకెవరు పనికివస్తారో చెప్పండి" అన్నారు. మన జిల్లాలో కాంగ్రెసులో మంచి వాళ్ళయిన వాళ్ళలో కల్లూరు చంద్రమౌళి గారొకరు. ఆయన పలుకుబడి కలవాడు, యం. యల్. ఏ. రేపు జిల్లాబోర్డు ప్రెసిడెంటు కావటానికి అవకాశాలున్నవాడు. ఆయనైతే బాగుంటుంది" అన్నాను.

ఆయనకు కాంగ్రెసు యిదంతా ఉన్నది కదా మన లేబరుకేమన్నా మేలు జేస్తాడా? అన్నారు. "ఓః ఈ రోజుల్లో కాంగ్రెసు పనే ముందిః మనపని దప్ప. మనకు తప్పకుండా పని చేస్తాడ"ని చెప్పాను. భేష్ బాగుంది. మనం కల్లూరి చంద్రమౌళిగారిని ప్రెసిడెంటుగా, శివయ్యగారిని శెక్రటరీగా పెట్టుకుందాం. మనకు సోషలిస్టు దప్ప శెక్రటరీ యింకోరొద్దు. కాళిదాసు నరశింహారావులు మనకు వద్దు" అన్నారు. 20 వ తారీకు సాయంత్రానికల్లా దాదాపు ముఠా నాయకులందరిని చూచాం. "రేపు 22 వ తారీకున ఎలెక్షన్లుగదాః ఏం చేయదలుచుకున్నారుః" ఏమోనయ్యా మాకేం తెలియదు. అంతా రహస్యంగా ఉంది. వెంకటప్పయ్య గారేం చెపుతారోనయ్యా, అయితే గుమాస్తాలు మటుకు నరసింహారావుగారిని శెక్రటరీగా ఉండాలని చెపుతుండారయ్యా. కాని మారాజు యజ్ఞన్నారాయణయ్య గారిని, గుమాస్తాలతో గలిసి కుట్రచేసి ఎళ్ళగొట్టిందుః మేడ మీదినుంచి దిగి రాడుగదయ్యా ఆయన్నెట్లా ఎన్నుకుంటామయ్యా. అది గాకపోయినా ఎంకటప్పయ్య గారూ అంత గొప్పోరని ప్రెసిడెంటు ... ఆ నరశిమ్మారావుగారు మేడలోనే గూసోని ... ఆ గుమాస్తాలు చెప్పిన మాటనే యింటాడే ... మా దగ్గిరకొచ్చి మమ్మల్నే పుడగడ్తే ఇదేం ... దయ్యా ఏమోనయ్యా ఈ గుమాస్తాలు ఈ

బాంబర్ని నమ్మి చెడిపోయ్యాం. మా సంఘం నాశనం అయింది. మూడు ప్రాణాలు లేచినయి కలకటేరు యిచారణతో సంఘానికి ఎగస్పార్టీగా సాక్షమిచ్చిన గుమాస్తాలంతా ఎలెక్షన్లని తిరుగుతున్నారే. మళ్లీ ప్రెసిడెంటు శెక్కురటరీలై యూనియన్ను దొరల కప్పజెపతార్రా కాటోలు. ఇదంతా ఎందుకు మా లేబరుకు బుద్ధి వుంటే అన్ని సక్రమంగా ఉండేవేః"

ఇవీ కూలీల్లో ధోరణి. నా వెంట వచ్చిన ఒక పెద్దమనిషి కొంచెం పలుకుబడి ఉన్నవాడు ఒకాయన "ఇదంతా ఎందుకండీ, నే చెబుతావిను. రేపు వెంకటప్పయ్య పంతులుగారు కాళిదాసు గారిని ప్రెసిడెంటుగా బెదతారు. నరశింహారావు గారిని ఆ పాతశెక్రటరీనే బెదతారు, అందరిని బ్రాంఛలను గుమస్తాలను పెడతారు మీ కిష్టమేనాః" అని అడిగాడు. "బ్రాంఛలు గుమాస్తాల నుంచే చెడిపోయినాం. పాత శెకరటరీకి సుతరం ఒప్పుకోము" అన్నారు గూడాల్లో కూలీలంతా. "అయితే వినండి మనం ప్రెసిడెంటుగా కల్లూరు చంద్రమౌళిగారిని, తెనాలి తాలూకా అమృతలూరు, యమ్. యల్. ఏ. జిల్లాబోర్డు మెంబరు ప్రెసిడెంటుగూడ అవుతాడు, ఆయన్ని బెట్టుకుందాం, శెక్రటరీగా ఇదిగో యీయన శివయ్యగారు మంచి దిట్టమైన సోషలిస్టు, గుంటూరు, యీయన్ని బెట్టుకుందాం. మనం రెండు మూడువేల జనాభా క్రిస్టియన్లు ఉన్నాం. మన తరపున ఒక వైస్‌ప్రెసిడెంటును పెట్టుకుందాం. ఏమంటారుః" "అంతేనయ్యా అంతే. సోషలిస్టుండాలిసిందే. ఆయాల, కాలువలు జరిగితే చచ్చిపోయినోళ్ళను మోసకొచ్చినది సోషలిజము వోళ్లేనయ్యా. విశారణల్లో రెయ్యనక పగలనక గుడిశలంబడి తిరిగి తిరిగి మనకోసం పనిచేశింది వీళ్లే. అన్నానికి డబ్బులు వసూలుచేసి యియ్యబోతే తీసుకోలేదుగాః సోషలిస్టు లేకపోతే యూనియన్ లేదు మనోళ్ళకు పనుల్లేవు." ఇది మా దగ్గిరకొచ్చిన కూలి సోదరులందరు మాట్లాడిన ధోరణి.

ఎవరు ఏ ఉద్దేశ్యంతో గుమాస్తాలని బ్రాహ్మణు పేరెత్తినా, కూలీలు మాత్రం, గుమాస్తాలంటే తమను బాధించే గుమాస్తాలని, బ్రాహ్మణులంటే తమను బాధించే బ్రాహ్మణులని మాత్రమే అర్థం చేసుకున్నారు. వారి శ్రేయస్సును గోరే బ్రాహ్మణులలో వారికి గురుత్వం ఉన్నది. అక్కడ కులాలను పాటించలేదు. అది సహజం కాదు కూడాను. గుమాస్తాలందరికీ, కూలీలకు తగాదాలున్నాయని, కుల వైషమ్యాలు తెచ్చినాయనేది శుద్ధ అబద్ధం.

21 వ తారీఖు సాయంత్రమే 5-30 గంటలకు కంపెనీ గేటు దగ్గర పంతులుగారు మీటింగు పెట్టారు. కూలీలు వచ్చేటప్పుడు" పాతవాళ్ళను పెట్టుకోమంటే ఎవడు పెట్టుకుంటారు. నరశింహారావుగారిని తీసెయ్యాలిసిందే" అని వాళ్ళలోవాళ్లు అనుకుంటూ వచ్చారు. ఒక వందమంది, లోపల పంతులుగారు 5 లేక 10 నిమిషాలసేపు మాట్లాడారు.

"నాలో నమ్మకం ఉన్నవాళ్లు చేతులెత్తండి!" అందరూ ఎత్తారు.

"నే చెప్పినవాళ్లను పెట్టనివాళ్లు చేతులెత్తండి!"

ఒకరు లేచి "అయ్యా మా కిష్టం లేని వాళ్ళను పెడతామంటే ఎట్లాగయ్యాః"

మీరు వాళ్ళ వీళ్ళ మాటలు వినకూడదు. ఇవ్వాళ నేను కంపెనీకి వ్రాస్తే అరగంట ముందు వదలటానికి ఒప్పుకున్నారు. ఎవరు చేస్తే వచ్చింది, అరగంట సెలవు. నేను మీకేమన్నా పని చేయాలని ఉంటే నే చెప్పినవారిని పెట్టుకోండి. నే చెప్పినట్లు వినేవాళ్ళు చేతులెత్తండిః"

(ఏ పదిమందో తప్ప అందరూ చేతులెత్తారు) పంతులుగారు ఈ ధోరణిలోనే పాకలు, గుడిసెలు అన్ని తిరిగి బోధించారు. రాత్రి 11, 12 దాకా కారులో తిరిగి రామమూర్తి నాయుడుగారిని వెంటబెట్టుకొని మరునాడు ప్రొద్దున్న కూలీల్లో నాయకులైన వారు కొందరు మళ్ళీ పాకలు తిరిగి తమ ప్రచారం చేసుకున్నారు.

సాయంత్రం ఎలెక్షన్లకు పోబోతుంటే నేతి దళపతిగారు అప్పుడే వచ్చి పంతులుగారితో రహస్యంగా మాట్లాడి, అక్కడే నిలుచున్న శివయ్య గొసుబేగు గార్లతో కాంతంగా జరిగిపోయేటట్లు చూడండి అని చెప్పి వెళ్ళారు.

5-30 కల్లా రామనగరు దిబ్బమీద యూనియన్ మెంబర్లు, మెంబర్లు కానివారు కూడాను. వారు వీరు విడివిడిగా కూచున్నారు.

సభకు పాత వైస్ ప్రెసిడెంటుగారు వల్లం రెడ్డి శ్రీరామమూర్తి నాయుడుగారు ఎలెక్షను అఫీసరుగా అధ్యక్షత వహించారు. పంతులుగారు ఉపన్యాసం.

"యజ్ఞనారాయణగారు మీకు అధ్యక్షుడుగా ఉండి చాల సేవ చేశారు. ఇప్పుడు ఆయన లేకుంటే యూనియను కొన్ని హక్కులిస్తామని, రిగగ్నైజ్ చేస్తామని అధికారులు చెప్పటం వల్ల, ఇంకా ఇతర కారణాల వల్ల ఆయనగారు అధ్యక్ష పదవి నుంచి విరమించుకున్నారు (కొందరు, నరశింహారావుగారు గుమాస్తాలు చేరి విశ్వాసం లేదని ప్యాసు చేశారుగా అని గొణుక్కున్నారు.) ఆయనగారి సేవను కొనియాడుచూ ఒక తీర్మానం ఉంది. తరువాత పాసుచేశాము. (మద్దిగిల్లి తోం బాడటం ఎందుకూ)......................

........నేను పెద్దవాణ్ణనో, మీకోసం పని చేస్తానని నమ్మకం చేతనో నాకు మీ సెక్రటరీ ప్రెసిడెంటు కార్యనిర్వాహక వర్గం పేర్లను ఏర్పాటుచేసే అధికారం ఇచ్చియున్నారు. మీ పాత కార్యనిర్వాహం వర్గంవారు మీకు బాగా తెలుసు. నేను మీకు బాగా సహాయం చేయాలంటే నేను చెప్పిన వాళ్ళను పెట్టుకోండి. అట్లా చేయుట మంచిది. నేను కొన్ని పేర్లను చదువుతున్నాను.

ఒకరు "మీరు చెప్పిన వాళ్ళందరిని తప్పకుండా ఒప్పుకోవాలా? కొందరు మాకిష్టము లేకపోతేనో" అని అన్నారు.

"వస్తున్నా మీరు మాట్లాడవద్దు. ముందు చదువుతున్నాను వినండి.

"అధ్యక్షులు—మాదల పెద్ది కాళిదాసుగారు చావల్ల, స్లీడరు, పెద్దవారు, మంచివారు (ఆయనను కాంగ్రెస్లో ... పెట్టాలని పాసు చేశారంట, ఆయన ...

అని ఒకరిద్దరు అడిగారు) అదేంలేదు. ఊరు కోండి. ఈయనకు అనుకూలురు చేతులెత్తండి" (చాలమంది చేతులెత్తారు.) ఆ అంగీకారమే.

ఉపాధ్యక్షులు—వెలగపూడి క్రిష్ణమూర్తిగారు బాపట్ల, మునిసిపాలు, సేవాసమితిలో పని చేస్తున్నారు. ఇంగ్లాండులో అక్కడ పెద్ద చదువు చున్నవాడు. ఈయన కనుకూలురు చేతులెత్తండి.

ఒకరు "అయ్యా ఆయన యెవరండీ? ఏరీ?"

"లేరు ఇక్కడ ఉండనక్కర్లేదు. కూచో. అ అనుకూలురు చేతులెత్తండి!"

చాలమంది ఎత్తారు. వ్యతిరేకంగా కొద్ది మంది.

"రెండవ ఉపాధ్యక్షులు— ఇదివరకు పాత వారే నల్లంరెడ్డి శ్రీరామమూర్తి నాయుడుగారు" (సభలో కలకలం.) కొందరు ఆయన మా కొద్దంటి ఒక కూలీ సోదరుడు లేచి "యీయ నెక్కడ దొరికారండి. ఈనేనంటి మమ్మల్ని మహా బాధించారండి. మాకు యూనియకాకు యెతిరేకంగా సాక్షం యిచ్చారండి. ఈయన మాకొద్దండి."

"ఉండవయ్యా! కూచో. అనుకూలురు చేతులెత్తండి." గుమాస్తాల నాయకుడు "ఊ" చేతులెత్తండి. అని అరిచారు. గుమాస్తాలు కొందరు. తయారచి పొందిన కూలీలు కొందరు చేతులెత్తారు. కలకలం మధ్య "అంగీకారమే" అన్నారు.

తరువాత నరుసుప్రకారం జనరల్ సెక్రెటరీ ఎలెక్షను రావాలి. కాని దేశభక్తులు జాయంటు సెక్రటరీల ఎలెక్షను పెట్టారు.

సహాయ కార్యదర్శులు— సుందరరామశాస్త్రి గారు మాయపు ఆనందరావుగారు ఏవైపు నుంచి అడ్డురాలేదు. చేతులెత్తారు. అంగీకరింపబడ్డారు. సుందరరామ శాస్త్రిగారు విశ్రాం చేసుకుంటా మన్నారు. పంతులుగారు కూచోమన్నారు.

ప్రధాన కార్యదర్శి— బూదరాజు నరసింహారావుగారు. పాతవారే. అనుకూలురు చేతులెత్తండి. (ఒకరు ఎలెక్షన్ సరిగా నడవటం లేదన్నారు.) ఎలా జరపవలసింది నాకు తెలుసు అల్లరి చేయకుండా కూచో. గుమాస్తా బలగం అంతా ఎత్తండి ఎత్తండి అని కేకలువేశారు. కొందరు చేతులెత్తారు. కొందరు ఆయన మా కొద్దండి.

"వ్యతిరేకులు" (అయ్యా అదేమిటో మాకు తెలియదు మళ్ళీ చెప్పండి)

"ప్రధాన కార్యదర్శి బూదరాజు నరసింహారావుగారు. వ్యతిరేకులు చేతులెత్తండి" (చాల మంది చేతులెత్తారు.) మీలో ఎక్కువ మంది వీరంటే అంగీకరించుటలేదు. అట్లా అవుతు తుంది. కార్యదర్శి విషయం తరువాత చూదాం. మిగతా కార్యనిర్వాహక వర్గాన్ని ముందు కానిద్దాం.

తరువాత పంతులుగారికి బదులు ఎవరో గుమాస్తాగారు లేచి వరుసన ఎన్నో పేర్లు లిస్టు చదువుకుని పోతున్నారు. సభలోఉన్న కార్మికులకు కొంతమందికి అపోశన అర్థం కాలేదు. అందరు లేస్తున్నారు కలకలంగా ఉంది.

పంతులుగారు "వీరంతా మీకిష్టమేనా! అనుకూలురు చేతులెత్తండి."

వెనుకనుంచి గుమాస్తాలు కొందరు కూలీలు గూడ "ఆ యిష్టమే. ఎత్తండి ఎత్తండి." సరి పాసైపోయింది దేశభక్తులు సెక్రటరీ ఎలెక్షను ఎత్తుతున్నారు. "మీలో చాలమందికి సెక్రటరీగా నరసింహారావుగారు ఉండటం ఇష్టం లేనట్లుగా వుంది. అయినగారు ఉండటంగూడ నా కిష్టంలు యిష్టం లేదు" బూదరాజు నరసింహారావుగారు కూడ ఐదు నిమిషాల ఉపన్యాసంతో ఉపసంహరించు కొన్నారు.

"సెక్రటరీగా మునిపల్లె వెంకటేశ్వర్లుగార్ని పెట్టుచున్నాను. (వెంకటేశ్వర్లుగారు కంపెనీ గుమాస్తా లేచి నిలుచున్నారు.) అనుకూలురు చేతులెత్తండి!" పదిమంది గూడా చేతులెత్తలేదు. పంతులుగారికేమీ తోచలేదు.

ఒకరు లేచి "పంతులుగారు ఒక మనవి."

"ఏమిటండీ"

"నేను పి. వి. శివయ్యగారు జనరల్ సెక్రటరీగా ఉండాలని కోరుచున్నానండి. మా కందరికీ అదే యిష్టం."

మాకు శివయ్యగారే కావాలి."శివయ్యగారూ, అయ్యా! శివయ్యగారూ" అని కేకలు వేస్తూ శివయ్యగార్ని లాక్కునిపోయి పంతులుగారి కుర్చీ ప్రక్కను నిలుచోబెట్టారు. ఒకరు శివయ్యగారికి చేతు లెత్తమన్నారు. దాదాపు అందరూ ఎత్తారు. జయ జయ ధ్వానాలు చప్పట్లు నిండిపోయినవి. పంతులుగారు కొంచెం నేపు నిర్విణ్ణులైనారు. వెనుక నుంచి గుమాస్తాలు కొందరు "అన్యాయం, రెండు చేతులెత్తారు. ఓటర్లు కానివాళ్ళు కూడా చేతులెత్తారు. ఒప్పుకోం బాలెటు నిష్టం ఎలెక్షను పెట్టాల నిందే దీనికి" అని గొణుగుతున్నారు.

ఇంతలో పంతులుగారు, పొద్దుపోయింది మీటింగు వాయిదా వేశామన్నారు. తేదీ చెప్ప లేదు.

కూలీలందరు. "కాంగ్రెసులో పెద్దంటారే, దేశభక్తులంటారే. సత్యం అంటారే. ఇష్టం లేక పోతే ఇంకోర్ని పెట్టుకోవచ్చునన్నారే. ఇప్పుడిదేమిటండీ. ప్రజాభిప్రాయం ప్రకారం పోతానన్నారే. పదిమంది కావాలన్న శివయ్యగారు తనకెందు కంగీకారం లేకపోవాలి. వదిపేర్ల తను చెప్పినవి ఒప్పుకొంటిమే. ప్రజలందరు చెప్పింది ఒక్కపేరు తను ఒప్పుకోకూడదు. "సోషలిజం వాళ్ల కూలీలు బీదోంళ్లేమిటి అన తల భాగ్యవంతులేమిటి అందరు సమానంగా ఉండాలంటారు. కాంగ్రెసోళ్లు బీదోళ్ళు బీదోళ్ళే భాగ్యభాగ్యవంతుల భాగ్యం అట్లాగే ఉండాలంటారు. ఇట్లాంటి పనులు చేస్తుంటే కాంగ్రెసేం కాంగ్రెసురా!"

ఇదీ పోరణి. పదేళ్ళ పిల్లలు కూడా అంటం మొదలుపెట్టారు.

"అమ్మయ్యా! యీ కొండెంకటప్పయ్యకి బాగా మేడమీద కూకోని గుమాస్తాలతో లాలూచీ చేసినందుకు బాగా పరాభవం అయింది లె"మ్మని చాలామంది కూలీలు గంతులు వేశారు. చెంకలు కొట్టారు.

మరునాడు కూలీలు వెంకటప్పయ్య పంతులుగారి దగ్గరకుపోతే "నా నాలుక గోసినా అబద్ధమాడను. నరసింహారావుగారికే ఎక్కువ ఓట్లు వచ్చినవి. శివయ్యకన్ని రాలేదు" అన్నారుట. ఇందుకు [illegible] ఏవర కొకసంగతి [illegible] పంతులుగారు. "యూనియనాలో సోషలిస్టు ఉండటం నాకిష్టము లేదు" అని.

ఈ వ్యాసంలో వ్యక్తులేమి ప్రాధాన్యమీను వద్దని వేడికోలు. చీరాల ఐ. యల్. టి. డి. కంపెనీ పనివారల సంఘ ఎలెక్షన్లనుంచి రాజకీయాల్లో ఆసక్తి ఉన్నవాళ్లు నేర్చుకోదగినవి ఉన్నవి. నాయకులు తమ నాయకత్వం క్రింద నడిచేవాళ్ళ దగ్గరనుంచి నేర్చుకోవాలి. లేకపోతే ఫలితం నిరంకుశత్వం. మార్క్సు అన్నాడు 'The Educators must be educated.' ఈనేర్పే వాళ్ళందరికి పెద్ద గురువు ప్రజాసామాన్యమే!

# ★ వార్తలు ★

## నడగాం ఫిర్కా రైతు సమావేశం.

31—10—38 తేదీ సాయంకాలము, నడగాం గ్రామంలో, నడిగాం ఫిర్కా రైతు సమావేశం. శ్రీ మసలాపు సన్యాసి నాయుడుగారి అధ్యక్షతను జరిగెను. ఈ సభకు ప్రారంభోపన్యాసం, కాంగ్రెసు సంఘ కార్యదర్శి శ్రీ గరిమెళ్ళ వెంకటరమణమూర్తిగారు సలిపిరి. సుమారు 1000 మంది రైతులు హాజరయిరి.

తరువాత యీ దిగువ తీర్మానములు ఆమోదింప బడెను.

1. వంశధార నదివలన కలుగు నష్టమును తగ్గించుటకు, రైల్వే వారికి ప్రమాదము లేకుండుటకు, వంశధార నది-ఉర్లాం స్టేషనుల మధ్య ఒక చిన్న వంతెన సీరు తెయుటకు కట్టించవలసినదిగా మద్రాసు ప్రభుత్వము, బి. యన్. రైల్వే వారికి సిఫార్సు చేయుటకు కోరుచూ ఈ సభవారు తీర్మానించు చున్నారు.

2. వంశధార వరదల వలన కలిగిన పంట నష్టమునకు, గవర్నమెంటు, జమీందారీ భూములలో 1348 ఫసలీకి, రివెన్యూ ఉద్యోగులు పరీక్ష చేసి, రిమిషన్లు యిప్పించవలసినదిగా, మద్రాసు ప్రభుత్వమును గోరుచున్నారు.

3. అన్ని యినాములు రానున్న జమీందారీ బిల్లులో, ప్రజాభిప్రాయమును అనుసరించి, చేర్చి ఈ రానున్న శాసన సభలో బిల్లుపెట్టుటకు ఈ సభవారు తీర్మానించు చున్నారు.

4. వెంటనే ప్రభుత్వమువారు రైత్వారీ విచారణ సంఘమును నియమింప గోరుచున్నారు.

5. వంశధార నాగావళి నదులకు, సంయుక్త పరచుటకు వెంటనే ప్రజల కష్ట నివారణకై ఆమోదించ యీ సభవారు గోరుచున్నారు.

6. రానున్న సంవత్సరమునకు అధికముగ సభ్యుల చేర్చుటకు వెంటనే కిసాను సంఘముల స్థాపించుటకు తీర్మానింపబడ మయినది.

7. వెంటనే ప్రభుత్వమువారు P.W.D. శాఖలో దుంతగముల చక్కగ సవరణ చేసి, క్రమ పరిపాలన స్థాపనము చేయవలెనినదిగను. మానివానలు రైతుల ఉద్యమములో, వారికి సానుభూతి తెల్పుచూ, తీర్మానించుచున్నారు.

8. ఈ జిల్లాలో సహకార సంఘముల పనిపాట్లు ఏమి బాగులేనందున, రైతు దుఃఖ స్థితి విచారణ చేయుటకు వెంటనే వ్యవసాయ మదుపులను, ఏర్పరచి సంఘములు, ఋణదాతల రైతెన్ను బిల్లుపెట్ట ప్రభుత్వమును గోరుచూ తీర్మానించు చున్నారు.

★ ★ ★

## పొలసానిపల్లి మొఖాసాదార్లు జులుము.

కృష్ణాజిల్లా నూజవీడు తాలూకా పొలసానిపల్లి గ్రామంలో రైతులు కాంగ్రెసులో చేరినారనే ముద్దేశ్యముతో ఆ గ్రామమునకు చెందిన మొఖాసాదార్లు రైతులకు గృహ కృత్యములు గూడ వ్యవసాయపు పనులు జరుగకుండా చాకలి, మంగలి వ్యవసాయపు కూలీలు మొదలగు వారిని పనులలోకి వెళ్ళనీయకుండా రైతులను అనేక విధములుగా బాధ పెట్టుచున్నారు.

ఇట్లు
అక్కినేని అచ్యుతరామయ్య,
నూజవీడు తాలూకా కాంగ్రెసు సంఘసభ్యుడు.

## తెనాలి తాలూకా రైతు సంఘము.

తెనాలి తాలూకా రైతు సంఘ కార్యనిర్వాహక వర్గ సమావేశము 17.11.38 వ తేదీని తెనాలి సోషలిస్టు పార్టీ ఆఫీసులో నాగళ్ళ క్రిష్ణయ్యగారి అధ్యక్షతను సమావేశమై ఈ క్రింది తీర్మానములు గావించెను.

1. తెమాల్ పాషా మరణమునకు విచారము 2. కాశీపట్నము రైతుల పోరాటాన్ని బలపరుస్తూ, జమిందారు చర్యల అంతరి 3. బాయంటు పట్టాలను మినహాయించవలెనని, ధాన్యపు బస్తా తూనిక అన్నిచోట్ల ఒకే విధముగా వుండేటట్లు చేయాలని ప్రభుత్వమును కోరుట 4. పూర్వపు కార్యదర్శి రాజీనామాను అంగీకరిస్తూ ఆ స్థానానికి కొత్త హనుమంతరావుగారిని, వానరెడ్డి నారాయణ ప్రసాద్ గారిని సహాయ కార్యదర్శిగా, ముత్తేవి మాధవాచార్యగారిని తాలూకా రైతు సంఘ అధ్యక్షులుగా ఎన్నుకోవడమైనది 5. రైతు సభ్యులుగా చేరు గడువు డిశంబరు 20 వరకు పొడిగించాలని తీర్మానములు చేయుటమైనది.

తెనాలి 18.11.38 } కొత్త హనుమంతరావు, తాలూకా రైతుసంఘ కార్యదర్శి.

★ ★ ★

## భీమవరం రెండెద్ల బండ్లవారి సంఘం.

ది 25-11-38 తేదీన భీమవరం గునుపూడి రెండెద్ల బళ్ళ సంఘంవారు వేలూరి సత్యనారాయణగారి అధిపత్యమున సమావేశమై చేసుకొన్న తీర్మానములు.

1. యీ సంఘమునకు సుంకర వెంకటరత్నంగారిని ప్రెసిడెంటుగాను సుంకర వెంకట్రామయ్యగారిని ఎన్నుకోవడమైనది. యీ సంఘమునకు వసూలు చేయబడే చందాలు వగయిరాలు ప్రెసిడెంటుగారి వద్ద నిల్వ చేయుటకు తీర్మానింపబడ మయినది.

2. సంఘ నిధి.

వారమునకు, బండికి 0—0—3 పైసా సంఘమునకు ఇవ్వవలెను. సదరు చందాలు ఏ జట్టుకు ఆ జట్టు మేస్త్రి వసూలుచేసి ప్రెసిడెంటుగారికి యివ్వవలెను.

3. రేట్లు గ్రామంలో ఎక్కడయినను సరే. బియ్యం బస్తాకు 0-1-0.

ధాన్యం బస్తా 1కి 0—0—9.

మాగరి లేక తవుడు బస్తా 1కి 0—0—6.

పొరుగూరు పనికి ఏ జట్టుకు ఆ జట్టు నిర్ణయించుకొని వెళ్ళుచుండ వలెను.

యీ రేట్లకు తగ్గించి ఎవరున్నూ పనిచేయకూడదు. ఇందుకు వ్యతిరేకంగా తోలే యెడల అలా వ్యతిరేకించిన వారికి రు 5—0—0 లు అపరాధము విధించి సంఘమున జమకట్ట వలెను.

4. యీ సంఘం నెల 1కి ఒకసారి అధమం సమావేశము అగుచుండ వలెను.

వేలూరి సత్యనారాయణ.
ప్రెసిడెంటు
2—11—38.



# ఏజన్సీలో రివెన్యూ మంత్రి పర్యటనం

## వ్యవసాయ కూలీ మహా సభలు.

19—11—38 వ తేదీ సాయంకాలం గుడివాడ తాలూకా వ్యవసాయకూలీ మహాసభ గుడివాడలో బల్లిపర్రు లాకు వద్ద జరుపబడినది. కామ్రేడ్ వేములపల్లి అంజనేయులుగారు అధ్యక్షత వహించిరి. మహాసభలో యీ దిగువ తీర్మానములు ఏకగ్రీవముగా ఆమోదించబడినవి.

1. బొంబాయి ప్రభుత్వపు వారి కార్మిక బిల్లు యెడల తమ అసమ్మతిని తెలుపుటకు కార్మికులు నవంబరు 7 వ తేదీని రాష్ట్రమంతటా జయప్రదంగా జరిపిన సమ్మె సందర్భంలో కార్మికులపై ప్రభుత్వం తుపాకులు కాల్పించినందుకు ప్రభుత్వ చర్యను ఈ సభవారు నిరసించుచూ, చనిపోయిన—దెబ్బలుతిన్న కార్మికులకు, వారి కుటుంబములకు తమ హృదయపూర్వక సానుభూతిని తెల్పుచున్నారు.

గుడివాడ తాలూకా వ్యవసాయ కూలీల సభ.

2. గ్రామము లందలి బంజరులను, భూస్వాముల స్వాదీనంలో ఫలసాయం లేకుండా ఉన్న భూములను, వ్యవసాయ కూలీల వశం చేసి, సమిష్టి వ్యవసాయ పద్ధతులమీద సాగుచేయించవలసినదిగా గవర్నమెంటు వారిని యీ సభవారు కోరుచున్నారు.

3. ఏవిధమైన ప్రతిఫలము లేకుండా వ్యవసాయ కూలీలకు గృహ, నీటి, ఆరోగ్య వసతుల నేర్పరచుచు, పల్లెలలోని పిల్లలకు ప్రాథమిక విద్య గరపవలసినదిగా ప్రభుత్వమువారిని కోరుచున్నారు.

4. కాలువలు, రోడ్లు, వంతెనలు మొదలగువాటి కంట్రాక్టులను గవర్నమెంటు, స్థానిక సంస్థలు, వ్యవసాయ కూలీ సంఘాలకే యివ్వవలసినదిగా యీ సభవారు కోరుచున్నారు.

5. చట్టరూపేణా వ్యవసాయ కూలీలకు కనీస వేతనమును నిర్ణయించవలసినదిగా ప్రభుత్వము వారిని కోరడమైనది.

6. వ్యవసాయకూలీల ఋణములను చట్టరూపేణా రద్దు చేసి, అవసరమైన ఋణాలను ప్రభుత్వమే బ్యాంకుల ద్వారా, వ్యక్తిగత బాధ్యత మీద, వడ్డీ లేకుండా దీర్ఘ వాయిదాల మీద తీర్చుకొనే సదుపాయములతో వెంటనే యిప్పించవలసినదిగా ప్రభుత్వమును యీ సభవారు కోరుచున్నారు.

7. పిల్లలు తక్కువ అయారనే కారణంతో ప్రాథమిక పాఠశాలల ఎత్తివేయకుండా, పిల్లలు ఎక్కువగా హాజరు అయ్యే సౌకర్యము లేర్పరచి, విద్యను ప్రోత్సహించ వలసిందని కోరుచున్నారు.

8. సామ్రాజ్య యుద్ధాలలో వ్యవసాయ కూలీలు పాల్గొనరాదని హెచ్చరించుచూ, జాతీయ స్వాతంత్ర్యమునకై పోరు సల్పవలసిందని యీ సభవారు కోరుచున్నారు.

★ ★ ★

రామచంద్రపురం తాలూకా వ్యవసాయకూలీ మహాసభ టేకి గ్రామంలో, డా॥ కావూరి మీరాసాహెబుగారి అధ్యక్షత క్రింద జరిగెను. కాంగ్రెసు ప్రభుత్వమువారు కూలి సమస్యపట్ల ఉపేక్ష వహించి, ఇంత వరకూ కూలీల రక్షణ కెట్టి శాసనం చేయకపోవుట శోచనీయమనియు, త్వరలో కనీసపు కూలి నిర్ణయిస్తూ శాసనం చేయవలెననియూ సభలో తీర్మానించబడెను.

## పర్యటనం.

రివెన్యూ మంత్రియైన శ్రీ ప్రకాశం పంతులుగారు ఈ నెల 16 వ తేదీ మొదలు 20 వరకు తూర్పు గోదావరి జిల్లా ఏజన్సీ ప్రాంతాలలో పర్యటనం చేశారు. ఆంధ్ర రాష్ట్ర ఏజన్సీ ప్రజల సంఘ కార్యదర్శి కామ్రేడ్ కొరసాటి పట్టాభి రామయ్య, తూర్పు గోదావరి జిల్లా కాంగ్రెసు కమిటీ అధ్యక్షులు శ్రీ మల్లిపూడి పళ్లంరాజుగార్లు, శ్రీ కళా వెంకట్రావుగారు, మంత్రిగారితో సంచారం చేశారు. భద్రాచలం, చర్ల, దొమ్మగూడెం, కూనవరం మొదలయిన గ్రామాలలో కోయ ప్రజలు వందలాదిగావచ్చి వినతి పత్రాలు సమర్పించుకొన్నారు. సభలలోను, రోడ్డు వెంబడిని, ఇతర గ్రామాలనుండి, మొత్తం సుమారు 60 వినతి పత్రాలు మంత్రిగారికి సమర్పించబడినవి.

కూనవరంలో, ఆంధ్రరాష్ట్ర ఏజన్సీ ప్రజల సంఘం తరపున రివెన్యూ మంత్రిగారికి సమర్పించబడిన మెమొరాండంలో యీ క్రింది కోరికలు గలవు: "మినహాయింపు ప్రదేశములు—అసంపూర్తి మినహాయింపు ప్రదేశములు" అనే విభజనను తొలగించి, ఆ ప్రదేశాలను వెంటనే ఇతర ప్రాంతాలవలెనే ప్రజా స్వామిక పరిపాలనకు లోబడి యుండేటట్లు చేయుట; రాజోలు ఎస్టేటు ల్యాండ్ ఆక్టు సవరణ చట్టాన్ని ఏజన్సీ ప్రాంతాలకుకూడా వర్తింపచేయుట; సివిల్, క్రిమినల్ తగాయిదాల విచారణకై అక్కడ స్థానిక ప్రజలచే ఎన్నుకోబడిన సంచార న్యాయ స్థానములు ఏర్పాటు చేయుట; ఏజన్సీలో సాగుకు లాయికీ అయివుండి, సాగు చేయబడకుండా ఉన్న భూముల్ని భూమిలేని ఏజన్సీ వ్యవసాయదారులకిచ్చి, పెట్టుబడి ఖర్చులకు ప్రభుత్వమే సహాయంచేయుట; ఈ సంవత్సరంలో మొదట వర్షాలులేకను, తరువాత అధిక వర్షాలవల్లను, వరదల చేతను, నష్టమైన పంటలకు పూర్తి రెమిషన్; పంట తయారయిన తరువాతనే పన్ను వసూళ్లు, మామూళ్లు, ఇతర అక్రమ వసూళ్ల నిషేధం చేయుట; ఉచిత మంచినీటి సౌకర్యాలు; వ్యవసాయదారుని స్వంత అవసరానికి అడవినుండి కంప, కర్ర మొదలయినవి ఉచితముగా తెచ్చుకొనే హక్కు; పుల్లరి రేట్లు రద్దుచేయుట; అడవి జంతువుల నుండి రక్షించుకోవడానికి ఆయుధములు ధరించే హక్కు; దీర్ఘ వాయిదాలపై సంవత్సరానికి, నూటికి, 3 రూపాయలకు మించని వడ్డీపై ఋణాలిచ్చుటకు భూమి తనఖా బ్యాంకుల స్థాపన; ఏజన్సీలో మద్య నిషేధ చట్టాన్ని అమలుపరచుట; ఉచిత వైద్య సహాయం; పశు వైద్య శాలల స్థాపన."

## నందివాడ గ్రామోద్యోగస్థుల అక్రమాలు

శ్రీ యార్లగడ్డ వెంకట నారాయణ చౌదరి గారు యీ విధంగా వ్రాస్తున్నారు: "మా గ్రామం గుడివాడ తాలూకాలో ఒక గవర్నమెంటు గ్రామం. మా గ్రామ మునసబు వేములపల్లి వీరరాఘవయ్య గారు, హెడ్ కరణం నందివాడ హనుమంతరావు గారు, అసిస్టెంటు కరణం బేతాళం కృపానందం గారు, గ్రామస్థుల మీద జరుపుతూన్న అక్రమములను గురించి మా గ్రామస్థులు ప్రభుత్వాధికార్లకున్నూ, తూర్పు కృష్ణాజిల్లా కాంగ్రెస్ కమిటీవారికినీ, చేసిన రిపోర్టులను గురించి విచారించుటకు 22—11—38 వ తేదీ సాయంత్రం తూ॥ కృ॥ జిల్లా కాంగ్రెస్ కమిటీ ప్రధాన కార్యదర్శి వీరపనేని గోపాలకృష్ణయ్య గారు, గుడివాడ తాలూకా కాంగ్రెస్ కమిటీ కార్యదర్శి బల్సు విశ్వేశ్వరరావు గారు వచ్చేసి విచారించారు. కొండపల్లి వీరబ్రహ్మరెడ్డి గారు, ఇంకా ముగ్గురు రైతులు, యానాదులు, ఉప్పర్లు తాము గ్రామోద్యోగస్థుల వలన పొందుచున్న బాధలనుగురించి చెప్పుకొని స్టేట్ మెంట్లు దాఖలు చేసుకొన్నారు."

## కరణంగారి లంచగొండితనం.

తుమ్మపూడి గ్రామ రైతు సంఘ కార్యదర్శియగు శ్రీ వాసిరెడ్డి నారాయణ ప్రసాద్ గారు యీ విధంగా వ్రాస్తున్నారు:—"తుమ్మపూడి గ్రామంలో, [illegible] వెంకట సుబ్బయ్యగారు అనే ఒక రైతు [illegible] సహకార భూమి తనఖా బ్యాంకులో అప్పుకు దరఖాస్తు పెట్టుకొనదలచి, దరఖాస్తు ఫారంలో [illegible]

నెంబర్లు, గ్రామ కరణంగారి సర్టిపై 'కాలం'లు వగయిరా మినహాయించి మిగతా 'కాలం'లన్నీ పూర్తిచేసి రెండు 'కాలం'లు పూర్తిచేయవలసినదిగా గ్రామ కరణము గారయిన సురిగె వెంకట అనంత పూర్ణచంద్ర రావుగారిని కోరగా, నీవు నా పెండ్లికి ఏమీ సహాయం చేయక పోగా తిరస్కరించినావు కాబట్టి ఆ తాలూకు ఐదు రూపాయలూ ఇప్పటిచ్చినగాని సంతకం చేయననియు, నీవు చెప్పుకోవలసిన చోట చెప్పుకోమనియు, తిరస్కరించినాడని సదరు వెంకట సుబ్బయ్య మా గ్రామ రైతు సంఘమునకు అర్జీ పెట్టుకొన్నాడు.

అధికారులు విచారణ జరిపించి, కరణముగారిపై తగు చర్య తీసుకోవలసినదని కోరుచున్నాను."

## కృష్ణాజిల్లా రైతాంగ విద్యాలయం.

ఈ నెల 19, 20 తేదీలలో శ్రీ అరికెపూడి రామనాథంచౌదరి, బి. ఏ., బి. యల్. వకీలుగారు రైతాంగ విద్యార్థులకు 1802 వ సంవత్సరంలో ప్రవేశపెట్టబడిన పెర్మనెంటు సెటిల్మెంటు విధానం, రైతులకు—జమీందార్లకు—ఈనాందార్లకు గల భూమి హక్కులను గూర్చియు, వేర్వేరు శిస్తు విధానముల గురించియు, సాకల్యంగా ఉపన్యసించారు. 21-11-38 వ తేదీని శ్రీ సుంకర సూర్యనారాయణ, బి. యే. గారు ప్రభుత్వ మండలి డిపార్టుమెంట్లు, పరిపాలనా విధానం, బోర్డు స్టాండింగ్ ఆర్డరు నె 26 రు. మొదలయిన విషయాలను గురించి వివరంగా బోధించారు. 22-11-38 వ తేదీని శ్రీ చంద్ర రాజేశ్వరరావుగారు అంతర్జాతీయ రాజకీయాలను గురించి బోధించారు.

## పట్టాలు వేరు చేయవలెనని దన్నంయమకు జప్తులు

శ్రీ మురుకుట్ల వెంకటప్పయ్య గారు ఈ విధంగా వ్రాస్తున్నారు:—"చిట్టేల గ్రామంలో, కొల్లి బుచ్చయ్య —పెమ్మరాజు వేణుగోపాలకృష్ణమూర్తిగార్లు మున్నగువారు ఇవ్వవలసిన 1348 వ ఫసలీ అక్టోబరు కిస్తీ బాకీలను యివ్వమని జమీందారుగారి ఉద్యోగులు అడుగగా పట్టా ముచ్చిలకాలు విరియావచ్చుననియు, ఏ భూమికి ఆ భూమి నెంబరు వేసి శిస్తుకు రసీదు యివ్వమని అడుగగా పట్టా మొత్తముకు రసీదు యిచ్చెద మనిరి. ఆక్టు ప్రకారం, ఏ భూమికి ఆ భూమి నెంబరు వేసి రసీదు పొందవలెనని యున్నది గాన, అట్లు ఇవ్వనిచో మేము శిస్తు యివ్వం అనిరి. తర్వాత జమీందారుగారి ఉద్యోగులు శిస్తు బాకీకి జప్తులు ప్రారంభించి, జప్తు చేయుటలో పైవారు చెల్లించవలసిన కిస్తీ మొత్తంకు జప్తులు చేయక, వారి వారి పట్టాలలో గల కొన్ని కొన్ని భూములకు యివ్వవలసిన శిస్తు దబ్బుకు మాత్రమే జప్తులు చేసిరి."

## మునగాల జమీలో జబర్దస్తీ వసూళ్లు.

### జప్తులు, దౌర్జన్యాలు

17—11—38 తేదీని, చిల్లంచర్ల అప్పయ్య (మునగాల రైతు) ఇంట్లో మగవారెవరూ లేని సమయాన్ని జమీందారీ నౌకర్లు యిల్లు జొరబడి, ఇంటి తలుపు ఊడపీకి, పెట్టెలు—పెనలు బస్తాలు వగైరా ఆస్తిని బయటపెట్టారు. ఇంతలో అప్పయ్యగారురాగా అవన్నీ నిలుపవెట్టి, మొలకు ఉన్న వెండి విశ్వల మొలత్రాడు, ఊడతీసి, అతని కొడుకు చెవులలో ఉన్న బంగారపు దుద్దులు బలవంతంగా లాక్కున్నారు. అప్పుడు అనగా జప్తు పద్ధతికాలంలో, అప్పయ్యకు డిమాండు నోటీసు యివ్వారు. అందులో 1347 వ ఫసలీ, ఏప్రిల్ రు. 19—14—6 లు అనే వద్ద తాను యివ్వవలసింది కాదు. తా నీయవలసిన 1348 వ ఫసలీ తాలూకు రు. 10—11—11 లు చెల్లిస్తానని చెప్పితే, ఉద్యోగస్థులు అంగీకరించ లేదు. డిమాండులోని యావత్తు మొత్తం, అనగా రు. 30—10—5 లూ పూర్తిగా చెల్లించాలి, లేకపోతే ఆస్థి తీసుకు పోతాం అన్నారు. విధిలేక సదరు రైతు రు. 30—10—5 లూ చెల్లించాడు. కాని, రసీదులో డిమాండులో ఉదహరించిన ప్రకారం 1347 వ ఫసలీ ఏప్రిల్ బాపతు అని ప్రత్యేకంగా వ్రాయలేదు. ఈపట్టా నేటివరకూ అప్పయ్యగారికి ఈయనే లేదు. జప్తు నగలను కూడా అతని వద్ద బలవంతంగా లాక్కొని వెళ్ళిపోయారు.

19, 63, 140 నెంబర్లు పట్టాల బాపతు మూడు డిమాండు నోటీసులు జాయింటుదార్లలో ఒకరయిన ఉప్పల రామయ్య గారికి 16-11-38 వ తేదీని సర్వ్యు చేశారు. శిస్తుకు సంబంధించిన దాఖలా పట్టాలు ఇస్తే, శిస్తు చెల్లిస్తానని వ్రాసి, నోటీసుమీద సంతకంచేసి తీసుకున్నాడు. ఇందుపై, ఎస్టేటుదారు 1934 వ సంవత్సరంలో రిజిష్టరైన పట్టా యివ్వబోగా, ఎస్టేటు ల్యాండ్ ఆక్టు 77 వ సెక్షన్, ఎ. ప్రకారం తనకు పట్టాలు యివ్వనందున సదరు పాత పట్టాలు తీసుకొనుటకు అతడు నిరాకరించాడు. మర్నాడు, అనగా 17-11-38 వ తేదీని ఎస్టేటు ఉద్యోగస్థులు సదరు ఉప్పల రామయ్య గారి ఇంటి మీదికి వెళ్ళి అక్రమంగా జప్తుచేయ సాహసించారు. 63 వ నెంబరు పట్టా తాలూకు డిమాండు నోటీసులోని ఫ. 1347 డిసెంబరు, ఏప్రిల్ బాపతు రు. 29-12-4 లు తాను యివ్వవలసినవి కావనిన్నీ, మిగిలిన రు. 3-5-3 లూ, మిగతా రెండు డిమాండ్ల బాపతు రు 18-14-8 లూ చెల్లింపుమన్నానని సదరు ఉప్పల రామయ్యగారు చెప్పగా, ఉద్యోగులు అంగీకరించలేదు. యావత్తు శిస్తుకూ జప్తు చేస్తాం అని బలవంతంగా రు. 120 ల కిమ్మతు గల బంగారపు కంటెను లాక్కొని వెళ్లారు.

19-11-38 వ తేదీని ఎస్టేటు నౌకర్లు అలుగోజు వీరనారాయణగారు అనే రైతుయింటిమీదకివెళ్ళి, అతడు యింట్లోలేని సమయాన 2 బిందెలూ, 3 తప్పాలలు, 1 మంచం, 10 కనగకాయ బస్తాలు బయటపెట్టి, ఇంటితలుపులుఊడదీశారు. ఇంతలో వీర నారాయణగారి తల్లి యీవలికివచ్చి, యిదేమి అన్యాయమని అడగ్గా, ఆమెను భయ పెట్టారు. విధిలేక ఆమె రు. 31-7-4 లు చెల్లించి జప్తు ఆస్థిని వశపరచుకొన్నది. డిమాండు నోటీసుకూడా ఆమెకివ్వలేదు.

## సరిహద్దులో రైతుల విడుదల

సరిహద్దు రాష్ట్రంలో, తోరూ నవాబు యొక్క అక్రమాలను యెదుర్కొంటూ ఫలాధర్ రైతులు అనేక వందల మంది శాసనోల్లంఘనం చేసి జైలు శిక్షలకు గురి అయారు. కాంగ్రెస్ మంత్రుల హయాంలోనే ఈఅన్యాయం జరగడం బాగులేదని పెద్ద ఆందోళన బయల్దేరింది. మసానీ మొదలైన సోషలిస్టునాయకులు సరిహద్దు ప్రధానితో సంప్రతించి, సత్యాగ్రహుల్ని విడుదల చేయవలసిందని ఒత్తిడి చేశారు. వీటికి ఫలితముగా, సుమారు 200 మంది ఫలాధర్ రైతులు విడుదల చేయబడ్డారు. ఇదే విధంగా, షాఅలం వంతెనకై రైతుల మీద విధించిన అదనపు పన్నును చెల్లించ నిరాకరించి, ప్రభుత్వ ఉత్తరువుల్ని ధిక్కరించినందుకు అరెస్టు చేయబడ్డ రైతులలో సుమారు 100 మందిని విడుదల చేసి, ఆ పన్నును రద్దు చేశారు.

## బీహారులో సత్యాగ్రహం

గయా జిల్లా, సాంబె అను గ్రామంలో రైతులు తమ జమీందారు చేస్తూన్న అక్రమణల్ని ఎదుర్కొంటూ ప్రారంభించిన సత్యాగ్రహం సాగుతోనే ఉంది. ఉద్యమానికి నాయకత్వం వహించిన జమునందన్ శర్మగారి మీద మరియు ముగ్గురు రైతు నాయకుల మీద సబ్ మేజస్ట్రేటు 144 వ సెక్షన్ జారీ చేసి, ఆ ప్రాంతం 24 గంటలలో విడిచిపెట్టి వెళ్ళి పోవాలని ఉత్తరువు చేశారు. కాని, వారా ఉత్తరువును లక్ష్యపెట్ట లేదు. ఆ గ్రామం విడిచిపెట్టి వెళ్ళలేదు. కాని, ఎరెస్టు లేమీ జరుగలేదు. పైగా, నాలుగు రోజు లయిన తరువాత 144 వ సెక్షన్ ఉత్తరువు ఉపసంహరించుకోబడింది. ప్రజల పట్టుదల, ఆందోళనయే దీనికి కారణం.

సరిహద్దు సత్యాగ్రహుల ఊరేగింపు.

ఇదే విధంగా, మాంఘీర్ జిల్లా బడాహియాతాల్ గ్రామంలో ప్రారంభమైన రైతు సత్యాగ్రహం సాగుతోనే ఉంది. విత్తులు నాటుట పూర్తి అయింది. రయితులు పొలాల్లో మామూలుగానే పనులు చేసుకొంటున్నారు. జమీందారు మనుష్యులు ఇది సహించలేక, నిత్యమూ రైతుల్ని క్రూరంగా హింసిస్తున్నారు. ఈ నెల 19, 20 తేదీలలో జిల్లా రైతు మహా సభ మాంఘీర్‌లో జరిగింది. దానికి హాజరు కావడానికి 100 మంది వాలంటీర్లు, రైతులు బడాహియా గ్రామం గుండా నడిచివస్తోంటే, జమీందారీ మనుష్యులు వారిని నిర్దాక్షిణ్యంగా కర్రలతో మూడు సార్లు బాదమోదారు. ఆరుగురు రైతులు స్పృహతప్పి పడిపోయారు. అనేక మందికి గాయాలు తగిలాయి.

## అస్సాంలోకూడా యిదే గాథ.

సిల్హెట్ జిల్లా షిర్కురా గ్రామములో రైతులు జైలునుంచి విడుదలయి వస్తూన్న తమ నాయకుల్ని ఆహ్వానించడానికి నవంబరు 19వ తేదీని ఎర్రజెండాలు, కాంగ్రెసు జెండాలు తీసుకొని, అబలకాంత గుప్త మొదలయిన సోషలిస్టు నాయకులయొక్క-కాంగ్రెస్ నాయకులయొక్క నాయకత్వాన్ని బ్రహ్మాండమయిన ఊరేగింపుగా వెళ్లతూంటే, ఆ తోవలో జమీందారుగారి మనుష్యులు ఊరేగింపుమీద పడి, రైతుల్ని గట్టిగా కొట్టారు, వాయిద్యాలు ధ్వంసం చేశారు. కొంత ధనాన్ని అపహరించారు. సుమారు 12 గురికి బలమైన గాయాలు తగిలాయి.



# కాంగ్రెస్ అసెంబ్లీ సభ్యునికి శిక్ష

## కాకినాడ

### [illegible] కార్మికుల సమస్యలు

కాకినాడ [illegible] కార్మికులు పనిచేస్తున్నారు. [illegible] 12 గంటలూ పని చేసినందుకు కూలికి 0-8-0 [illegible] 0-10-0, [illegible] 0-12-0 [illegible] 1-8-0 ఇస్తారు. [illegible] కొంత పెద్ద అనేక [illegible] మినహాయింపు చేయుచున్నారు. పని సమయంలో [illegible] కార్మికునకు [illegible] పోయింది. [illegible] ఏమి ఇవ్వలేదు.

అక్టోబరు 28 వ తేదీని యీ కార్మికుల సంఘం [illegible] స్థాపించబడింది. సుమారు 1,000 సభ్యులుగా చేరారు. వారి కనీసపు కోర్కెలను యీదిగువ ప్రకటిస్తున్నాము.

### కనీసపు కోర్కెలు

1. (a) కాకినాడ ఒడ్డునుంచి స్టీమరు వద్దకు [illegible] పనివాళ్లపై గవర్నమెంటు [illegible] ప్రకారము ఎంతమంది ప్యాసింజర్లను [illegible] ఎక్కించవచ్చునో అంత మందినే ఎక్కించి తీసుకువెళ్ళాలి.

(b) ఆ పడవలు భద్రంగా ఉంచాలి.

(c) పడవ రేవులకై కూలీల కూలిలోనుంచి మినహాయించక, యావత్తు రేవు కంపెనీలే భరించాలి.

2 (a) కాకినాడ ఒడ్డు వదలినది మొదలు తిరిగి ఒడ్డు చేరే వరకూ చాలినంత ఆరోగ్యమైన భోజనం కంపెనీలు పెట్టాలి.

(b) వంట చేయు, భోజనం చేయు, విశ్రాంతి తీసుకొను స్థలాలు బహు శుభ్రంగా ఉంచాలి.

(c) స్నానం చేయుటకు సరియైన అవకాశాలు కల్పించాలి.

(d) అన్నివేళల యందు మంచినీళ్ల సప్లయి చేయాలి.

(e) ఉదయం భోజనం చేయుటకు ఒక గంట పూర్తిగాను, మధ్యాహ్నం భోజనమునకు ఆ భోజనాంతరం విశ్రాంతికి రెండు గంటల టైమునూ యివ్వాలి.

(f) ప్రతి స్టీమరుకు అనుభవం గల డాక్టరుండాలి.

(g) జబ్బు చేసినను, ప్రమాదం వచ్చినను, కంపెనీలే పూర్తి వైద్య సహాయం చెయాలి. ఆ కాలంలో సరియైన అహారం సప్లయి చేయాలి.

3 ప్రమాదం వచ్చినపుడు 'వర్క్ మెన్సు కంపెన్ సేషన్ ఆక్టు' ప్రకారం నష్ట పరిహారం యివ్వాలి.

4 (a) ఇతర రేవులలో యీ కంపెనీలు యిచ్చుచున్న కూలికి తక్కువ గాకుండా, యిచ్చట కూలి హెచ్చించాలి.

(b) 'దుబాష్ కంపెనీ'లకు గాని, దుబాషీలకు గాని, తండేళ్ళకు గాని మరియే మధ్యవర్తులకు గాని కూలీల జీతము ఇవ్వరాదు.

(c) నిర్ణయింపబడిన కూలి నుండి ఎట్టి అక్రమ వసూళ్లు, ఎవరు చెయ్యక, పని పూర్తి అయిన క్షణం ఏ కూలీ యొక్క కూలి ఆ కూలికే పూర్తిగా పరాయి కంపెనీ ఉద్యోగి సరే యివ్వాలి.

(d) క్రేన్ ప్రయోగించు మెషీనరైన కష్టమగు పనులకు హెచ్చింపు కూలి యివ్వాలి. అప్పుడు వైద్యసహాయం ఏర్పాటు చేయవలెను.

(e) రోజు 13 పగలు 8 గంటలు మించి చేసిన కాలం రాత్రికాలం ఓవర్ టైముగా లెక్కించి దానికి సగటు రేటుకు లెక్కింపు కూలి యివ్వాలి.

(f) వంటచేయుట, మంచినీటి సప్లయి మొదలైన ఉమ్మడి పనులకు ప్రత్యేక మనుష్యులను నిర్ణయించి, వారికి కూడా కూలీంతో సమాన వేతనం యివ్వాలి.

5 (a) కూలీలు కాకినాడ ఒడ్డు వదలినది మొదలు స్టీమరు చేరేవరకూ పని పూర్తి అయిన పిమ్మట స్టీమరు వద్దనుండి ఒడ్డు చేరే వరకూ పట్టు కాలమునకు స్టీమరు ఆలస్యమైనప్పుడు ఆ ఆలస్యమైన కాలమునకు సగటు రేటున కూలి యివ్వాలి.

(b) రోజు 13 పగలు 8 గంటలు మాత్రమే పని చేయించాలి.

(c) అంతకు హెచ్చుచేసిన పగలు టైము రాత్రికాలం 'ఓవర్ టైము'గా లెక్కించాలి.

(d) పగటి కూలి 0-12-0 న్నూ రాత్రి కూలి 1-8-0 న్నూ ప్రస్తుతం ఉండాలి.

6 ఈ కూలీల సంఘమును కంపెనీ యజమానులు, ప్రభుత్వం గుర్తించాలి.

వీటికై యీ కార్మిక సంఘం పనిచేస్తోంది.

## బెజవాడ

### గురుస్వామిగారి ఉపన్యాసం.

ఆసియా అంతర్జాతీయ కార్మిక మహాసభకు వెళ్ళి తిరిగివచ్చిన గురుస్వామిగారు బెజవాడ రైల్వే కార్మికుల సభలో ఉపన్యసించారు. సభకు ఎర్ర జెండాలతో పెద్ద ఊరేగింపులో ఆయనను గొనివచ్చారు. మద్రాసు రాజధానిలో కార్మికులకు మేలు చేకూర్చే శాసనాలను చేయవలసిందని ప్రభుత్వమును హెచ్చరించారు. ప్రపంచంలోని పెట్టుబడిదారీ దేశాలలో కార్మికుల సమస్యలన్నీ ఒక్కటేననియు దేశానికి రాజకీయ స్వాతంత్ర్యం వచ్చినంత మాత్రాన్నే కార్మికుల హక్కులు నెరవేరవనియు, తమ తమ హక్కులను రాబట్టుకోడానికి కార్మికులు ఐకమత్యం, బలం కలిగి ఉండాలి అనియు, తామేదో చేయుచున్నామనియు అంతవరకు ఆందోళన చేయకుండా ఊరకుండ వలసినదనియు చెప్పుటవలన ప్రభుత్వము కార్మికుల బలమును తగ్గించుచున్నది అనియు, ఉపన్యసించారు. కార్మికులు తమ తమ సంఘాలను బలపరుచుకో వలసినదని హెచ్చరించారు.

## కార్మిక సమస్యలు

## ధవిళేశ్వరం

### పి. డబ్ల్యు. డి. కార్మికుల సమ్మె.

ధవిళేశ్వరమువద్ద పి. డబ్ల్యు. డి. వర్కుషాపులోని కార్మికులకు నిలకడగా సంవత్సరం పొడుగునా పని ఇవ్వటం లేదు. ఒక సంవత్సరము క్రిందట యిచ్చట కార్మిక సంఘము ఏర్పడి గా, గిరి, యాకూబ్ హుస్సేనుగార్లకు తమ యిబ్బందులను వెల్లడించారు. యూనియన్ యొక్క కృషివలన సంవత్సరానికి 15 రోజుల శలవు, పని సంవత్సరాల పర్యంతం అయిన తరువాత పింఛను సదుపాయాలు ఏర్పాటు చేయబడ్డాయి. కాని, అవి ఇంకా అమలు జరుగలేదు. పీస్‌వర్కు, కాంట్రాక్టు పద్ధతి పోవలెనే ఉండాలనియు 19, 20 తేదీలలో వర్కుషాపు సూపరింటెండెంటుకు, ఎగ్జిక్యూటివు ఇంజనీయరుగారికి, తెలియచేసి ఏమీ సమాధానం లేకపోవుటచే 20 వ తేదీ నుండి పని చేయడం మానివేశారు. 23 వ తేదీని పి. ఆర్. కే. శర్మగారు ధవిళేశ్వరం వెళ్ళి విచారించి సూపరింటెండింగ్ యింజనీయరును, వర్కుషాపు ఇంజనీయరును, కార్మిక సంఘ కార్యవర్గాన్ని కలుసుకొని చర్చించి పీస్‌వర్కు పద్ధతి రద్దు చేయవలసినదని కోరుతూ, గా, గిరి, యాకూబ్ హుస్సేనుగార్లకు కబురు చేశారు.

## మధుర

### కార్మిక సంఘాధ్యక్షునికి 6 నెలల కఠిన శిక్ష.

పసుమలై మిల్లు కార్మిక సంఘాధ్యక్షులు శ్రీ ముత్తు రామలింగదేవరు యం. యల్. ఎ. (కాంగ్రెసు) గారిపై కేసు విచారణ ముగిసింది. మద్రాసు ప్రభుత్వము చేసిన ప్రకటన తన కేసును బలహీన పరచినదని దేవరుగారు పిటీషను పెట్టారు. కోర్టువారు నిరాకరించారు. దేవరుగారు తన డిఫెన్సును మానివేశారు. కోర్టువారు దేవరుగారు అనుచరులను మార్గావరోధము కలిగించు పనులు చేయులాగున ప్రోత్సాహించనని దేవరుగారి నుండి వాగ్దానం అడిగారు. ఆయన వ్రాత పూర్వకంగా అట్టి వాగ్దానం యిచ్చాడు. అందుపై ఆయన స్వంత జామీను 500 రూపాయలున్నూ అట్టివే మరి రెండు జామీను లున్నూ ఇవ్వ వలసిందని కోర్టువారు కోరారు. దేవరుగారు నిరాకరించారు. అందుపై ఆయనకు 6 నెలలు కఠిన శిక్ష విధింపబడింది. ఈ సమ్మె సందర్భంలో అరెస్టు చేయబడ్డ 88 మంది కార్మికులను ఏ షరతులు లేకుండా విడుదల చేశారు. ఇంకొక సెక్షను క్రింద అందులో 4 గురిని తిరిగి అరెస్టు చేశారు.

## బొంబాయి

జనరల్ స్ట్రైకు అయిన మరునాడు 8వ తేదీన యథావిధిగా కార్మికులు పనిలోకి వెళ్ళారు. కాని కొందరిని పనిలోకి తీసుకోమని యజమానులు బెదిరించారు. వారందరు ట్రేడ్ యూనియన్ ఆఫీసుకు పోయి తెలియజేశారు. అందుపై కార్మిక నాయకులు కార్మికులకి సలహా ఇచ్చారు "నిన్నటి సమ్మెలో మేమే నెగ్గింది. మమ్మల్ని పనిలోకి తీసుకోకపోతే, మళ్ళీ జనరల్ స్ట్రైకు చేస్తాం. జాగ్రత్త" అని చెప్పమన్నారు. ఆ సలహా ప్రకారం కార్మికులు మిల్లు యజమానులతో చెప్పారు. కిక్కురు మనకుండా యజమానులు కార్మికులను పనిలోనికి తీసుకొన్నారు.

ముర్లాలోని స్వదేశీ మిల్లులలో నూలు వడికే 3 గ్గురు కార్మికులను పనిలోనుండి యజమానులు తొలగించారు. వారిని తిరిగి పనిలో చేర్చుకోవలసిందని కోరుతూ ఆ డిపార్టుమెంటులోని కార్మికులు సమ్మె చేస్తే యజమానులు మిల్లునే మూసివేశారు. కార్మిక తగాదా బిల్లు వల్ల బలపడిన మిల్లు యజమానుల దాడి కార్మికులపై అప్పుడే ప్రారంభమయింది.

### సురేశ బెనర్జీగారు

అఖిలభారత ట్రేడ్ యూనియన్ కాంగ్రెసు అధ్యక్షులయిన సురేశచంద్ర బెనర్జీగారు, బొంబాయి కార్మిక తగాదా బిల్లువల్ల కార్మికులకు కాంగ్రెసుకు మధ్య ఏర్పడిన భేదాభిప్రాయాలను రద్దు చేయుటకు అవసరమగునట్లు బిల్లును మార్పు చేయుటకు కొన్ని సూచన లిచ్చారు. పరిశ్రమలో పనిచేసే కార్మికులలో సగం మంది సభ్యులుగానున్న ట్రేడ్ యూనియన్లను రిజిస్టరుచేసి దానిని యజమానులు ప్రభుత్వము గుర్తించాలి. రిజిష్టరు కానట్టి ట్రేడ్ యూనియన్లకు మిల్లు యజమానులకు మధ్య కలిగే తగాదాలలో లేబరు ఆఫీసరు కార్మికుల ప్రతినిధిగా ఉండటం అసహ్యకరమైనది. వారి తగాదాల పరిష్కారానికై ఏర్పాటు చేయబడిన విచారణ కోర్టు పరిశ్రమశాలలనుండి సాక్ష్యములను తీసుకొని పరిష్కారము చేయవలెను. లేబరు ఆఫీసరుకు అధికారములను ఇచ్చే భాగాన్ని (4వ చాప్టరును) బిల్లులో నుండి తొలగించాలి. విచారణ సమయంలో ఏమాత్రము ఆశాకరమగు ఫోరణి కనుపించినను కార్మికులు సమ్మె చేయరు, అందుచే విచారణ సమయములో సమ్మెలను నిషేధము చేస్తూవున్న క్లాజును రద్దుచేసి, సమ్మెలకు అవకాశమివ్వాలి, అని కొన్ని సూచనలను చేశారు. బిల్లును ప్రతిఘటించుటలో కార్మికుల సమ్మె ఏమాత్రము కాంగ్రెసుకు వ్యతిరేకం కాదనియు తండ్రి కొడుకుల తగాదావంటిదే ననియు చెప్పారు. దీనినిగూర్చి సర్దారు వల్లభాయి పటేలుగారితోనూ గాంధీగారితోను మంత్రులతోనూ జవహర్‌లాలు నెహ్రూగారితోనూ కూడా మాట్లాడారు.

### గవర్నమెంటు ప్రెస్ వర్కర్ల నోటీసు.

బొంబాయి గవర్నమెంటు ప్రెస్సులో పని చేస్తూన్న కార్మికులకు కనీసపు తమ జీతాలు ఏర్పాటు చేయాలనియు, వారి జీతాలలో గ్రేడ్లు నిర్ణయించాలనియు, సాలీనా 20 రోజులు జీతముతో శలవు లుండాలనియు సుమారు 2 సంవత్సరాల నుండి కోరుతున్నారు. ఇవి నెరవేర్చక పోతే సమ్మె చేస్తామని నోటీసిచ్చారు.

## అహమ్మదాబాదు

### కార్మికుల అరెస్టు.

సందేశ పత్రికా కార్యాలయములో ప్రెస్ కార్మికులు జీతాలకై సమ్మె ప్రారంభించారు. నవంబరు 15 నుండి పికెటింగు జరుగుతోంది. నవంబరు 17 వ తేదీకి 100 గురు పికెటర్లు అరెస్టు చేయబడ్డారు.

## అస్సాన్సాల్

### 144 ప్రయోగం

అస్సాన్సాల్ సమ్మె సందర్భంలో 1 నెల వరకు 144 ను 18 వ తేదీనుండి ప్రయోగించారు. ఫ్యాక్టరీలోకి లారీలలో కార్మికులను పోలీసు సహాయంతో యజమానులు తీసుకొని పోతున్నారు.

(మిగతా 18 వ పేజీలో)

'రాను. నాకిక్కడే బాగుంది.'

'ఇంకా స్త సారా త్రాగుతావా?'

"తాగుతాను." అని అతను చంద్రముఖి మెడ వాలు వేసుకుని—"ఎవరు బాబూ నువ్వు, నా కింత ముఖ్య మిత్రుడివి" అన్నాడు.

చంద్రముఖి కళ్ళ వెంట నీరు కార నారంభించింది. దేవదాసు అమె మెడ పట్టుకుని తూలుతూ ఎలాగో చాలా ప్రయాస మీద లేచి నిలబడి చంద్రముఖి ముఖం వంక చూసి—"వహ్వా! భలే నాణ్యమైన సరుకోయ్ దేవదాసు!" అన్నాడు.

చంద్రముఖికి ఏడుపులో కూడా నవ్వు వచ్చింది.

"అఁ, భలే నాణ్యమైన సరుకు! సరే, నా భుజం మీద చెయ్యి వేసి ఇంకా స్త మూలం నడువు. బండి కావాలి కామా?" అన్నది.

"ఎందుకు కావద్దూ!" అని దేవదాసు దోవను నడుస్తూ—"నువ్వు నన్ను ఎరుగుదువా, సుందరీ?"అని పట్టుకుపోయిన గొంతుతో అడిగాడు.

"ఎరుగుదును" అన్నది చంద్రముఖి.

"అంతా నన్ను మరచిపోయిరి. ఇక నువ్వే మిగిలావ్" అన్నాడు దేవదాసు పాడుతూ.

తర్వాత చంద్రముఖి ఆధారంతో బండి ఎక్కి ఇంటికి చేరాడు. వాకిట దగ్గర నిలబడి జేబులో చెయ్యి పెట్టి—"సుందరీ! దోవలో ఉన్న వాణ్ణి పట్టుకొచ్చావు కాని జేబులో దమ్మిడీ కూడా లేదు!" అన్నాడు.

చంద్రముఖి మాట్లాడకుండా లోపలికి లాక్కొచ్చి మంచం మీద పండుకోబెట్టి నిద్రపొమ్మని చెప్పింది.

దేవదాసు పట్టుకుపోయిన గొంతుతో—"ఇంకా వేరే ఆశ లేమైనా ఉన్నాయా ఏమిటి? నేను ముందుగానే చెప్పాను—జేబు ఖాళీ, లాభం లేదని—తెలిసిందా, సుందరీ" అన్నాడు.

సుందరి తెలుసుకుని—"రేపు ఇద్దరుగానిలే!" అన్నది.

"అంత నమ్మకం మంచిది కాదు. ఏమి కావాలో స్పష్టంగా చెప్పు" అన్నాడు దేవదాసు.

"రేపు విందురు గాని" అని చంద్రముఖి పక్క గదిలోకి వెళ్ళిపోయింది.

దేవదాసుకు నిద్ర తెలిసేవరకు చాలా ప్రొద్దు ఎక్కింది. గదిలో ఎవ్వరూ లేరు—చంద్రముఖి స్నానం చేసి వంట చేస్తూ ఉన్నది. దేవదాసు ఒకమాటు గది అంతా పరికించాడు. ఒక్క వస్తువును కూడా అతను గుర్తించలేకపోయాడు. క్రిందటి రాత్రి సంగతులు కూడా అతని కేమీ జ్ఞాపకం లేవు: ఎవరో మనస్ఫూర్తిగా చేసిన పరిచర్య మాత్రం జ్ఞాపకం ఉన్నది—ఎవరో అతన్ని మహా ప్రేమతో తీసుకు వచ్చి నిద్ర పుచ్చటం లీలగా తోస్తున్నది.

ఇంతలో చంద్రముఖి గదిలోకి వచ్చింది. అలంకరణలో రాత్రికి ఇప్పటికీ ఆమెలో చాలా మార్పు కనిపించింది. నగ లేమీ తీసివేయలేదు: కాని తల దువ్వలేదు, అద్దకం చీరె కట్టలేదు, తాంబూలం వేయ లేదు. మామూలు సాదా చీరె కట్టుకున్నది. దేవదాసు ఆమె ముఖం వంక చూసి నవ్వి—"నిన్న నువ్వు నన్ను ఎక్కడ నుంచి దొరుకొచ్చావు?" అని అడిగాడు.

"దొరుకు రాలేదు. దోవలో పడి ఉంటే ఎత్తుకు వచ్చాను."

దేవదాసు గంభీరంగా—"సరే, ఎలాగైతే నేం తెచ్చావు. కాని, ఏమిటి మళ్ళీ ఈ వేషం? ఒంటిమీద నగలు పట్టటం లేదు, ఎవరిచ్చారు?" అని అడిగాడు.

చంద్రముఖి దేవదాసు ముఖం వంక తీక్ష్ణంగా చూసి—"మళ్ళీ?" అన్నది.

దేవదాసు నవ్వుతూ—"కాదు—అది కాదు. కొత్త నటనం అడితే తప్పా? ఎప్పు డొచ్చావు?"

"నెల పదిహేను రోజు లైంది."

దేవదాసు మనస్సులో లెక్క వేసుకొని—"మా ఇంటి దగ్గర నుంచి ఇటే వచ్చావా?" అన్నాడు. చంద్రముఖికి ఆశ్చర్యం కలిగించింది.

"మీ ఇంటికి వెళ్ళానని ఎలా తెలుసుకున్నారు?"

"నువ్వెళ్ళిన రెండు రోజులకు నేను ఇంటికి వెళ్లాను. నిన్ను మా వదినె దగ్గరికి తీసుకు వెళ్ళిన దాని, మొన్న ఆశ్వత్థపురం నుంచి వక్కాని స్త్రీ ఒకతె వచ్చిందని చెప్పింది. ఇంక తెలుసుకోడం ఏమి కష్టం? సరేకాని ఇన్ని నగలు ఎందుకు చేయించావు?"

"చేయించ లేదు. ఇవన్నీ గిల్టువి, కలకత్తా వచ్చి కొన్నాను. చూడండి, మళ్ళీ మీ మూలాన ఎంత ఖర్చుపెట్టవలసి వచ్చిందో? అంతకూ మీరు నన్ను గుర్తించనే లేకపోయారు!"

దేవదాసు పక పక నవ్వి— "పూర్తిగా గుర్తించలేదు! కాని నీ పరిచర్య మాత్రం గుర్తించాను. చంద్రముఖి తప్ప నా కింత పరిచర్య ఎవరు చేస్తారని చాలా సార్లు అనుకున్నాను."

చంద్రముఖి ఆనందం పట్టలేక ఏడవా లనుకున్నది. కొంచెం సేపు మౌనంగా ఉండి—"మీరు నన్ను పూర్వం మాదిరిగా అసహ్యించుకోవటం లేదు కదూ?" అని అన్నది.

"లేదు. పైగా ప్రేమిస్తున్నాను."

మధ్యాహ్నం దేవదాసు స్నానం చేసేటప్పుడు, అతని పొట్ట మీద ప్లానలు గుడ్డ కట్టి ఉండటం చూసి, చంద్రముఖి భయపడుతూ— "అదేమిటి! ప్లానలు కట్టా రెందుకు?" అని అడిగింది.

"నీకింత ఆదుర్దా ఎందుకు? కడుపులో కొంచెం నొప్పిగా ఉన్నది."

చంద్రముఖి తల వాచుకుని—"కొంప ముంచి లివరు జబ్బు కాదు గదా?" అన్నది.

"అలాగే కనపడుతున్నది, చంద్రముఖీ!" అన్నాడు దేవదాసు.

ఆరోజునే డాక్టరు వచ్చి చాలాసేపు పరీక్షించి ఈ సందేహమే వెలబుచ్చాడు. మందిచ్చి చాలా జాగ్రత్తగా ఉండకపోతే ప్రమాదం చేయవచ్చని హెచ్చరించాడు. దీని అర్థం ఇద్దరూ గ్రహించారు! దేవదాసు ఇనకు కబురుచేసి ధర్మదాసును పిలిపించాడు; చికిత్సకోసం డబ్బుకూడా తెప్పించాడు. రెండు రోజు లిలా గడిచినవి. మూడోనాడు దేవదాసుకు జ్వరం తగిలింది. చంద్రముఖిని పిలిచి—"మంచి అదనులో వచ్చావు. లేకపోతే నిన్ను చూసేవాణ్ణి కాను" అన్నాడు.

చంద్రముఖి కళ్లు తుడుచుకుని ప్రాణాలు ఒడ్డి సేవ చేయ నారంభించింది. 'వారి అవసరానికి అక్కరకు వస్తానని అనుకోలేదు—దేవదాసుకు ఆరోగ్యం కలిగించు!'అని భగవంతుని ఉద్దేశించి ప్రార్థించినది. దేవదాసు ఒక మాసంకంటె ఎక్కువే మంచంలో ఉన్నాడు. తర్వాత నెమ్మదిగా అతని జబ్బు తిరుగు ముఖం పెట్టింది—ప్రమాద స్థితికి తీసుకు రాలేదు.

ఒకనాడు దేవదాసు చంద్రముఖితో—"చంద్రముఖీ! నీ పేరు చాలా పెద్దది. ఎప్పుడూ పిలవా లంటే చాలా ఇబ్బందిగా ఉన్నది—కొంచెం చిన్నది చేయా లనుకుంటున్నాను" అన్నాడు.

"మంచిదేగా" అన్నది చంద్రముఖి.

"అయితే, ఇవ్వాళ నుంచి నేను నిన్ను 'అమ్మీ' అని పిలుస్తాను."

చంద్రముఖి నవ్వి—"అలాగే పిలవండి. కాని పిలుపుకి అర్థముండాలిగా!" అన్నది.

"అన్ని మాటలకూ అర్థ ముంటుందా? అది నా అభిలాష."

"అంత అభిలాషగా ఉంటే పిలవండి. కాని ఆ అభిలాష ఎందుకో చెప్పుతారా?"

"ఉహుఁ. అది నువ్వెప్పుడూ అడగకూడదు."

"అలాగే, అడగనులెండి." అని చంద్రముఖి ముఖం చాటుచేసుకున్నది.

దేవదాసు చాలాసేపు మాట్లాడకుండా ఉండి, అకస్మాత్తుగా—"సరే, అమ్మీ! నువ్వు నా కెవ్వరవని ఇంత ఇంత ప్రాణ ప్రదంగా సేవ చేస్తున్నావు?" అని గంభీరంగా అడిగాడు.

చంద్రముఖి కొత్త పెళ్ళికూతురు కాదు; వాక్పటుత్వంలేని బాలికా కాదు. దేవదాసు ముఖంవంక రెప్ప వాల్చకుండా, శాంతంగా చూస్తూ—"మీరే నా సర్వస్వం—అది ఇంతవరకు మీరు తెలుసుకోనేలేదా?" అన్నది స్నేహ గద్గద స్వరంతో.

దేవదాసు గోడవంక దృష్టి మరల్చి మెల్లగా—"తెలుసుకున్నాను, కాని నాకిది ఏమీ ఆనందం కలిగించటంలేదు. పార్వతిని నే నెంత ప్రేమించేవాడిని! ఆమె నన్నెంత ప్రేమించేది. అయినా ఎన్ని చిక్కులు! అనేక కష్టాలు అనుభవించిన మీదట ఇక ఈ ఉచ్చుల్లో కాలు పెట్టకూడదని స్థిరపరచుకొన్నాను. నా ఇష్టంతో పెట్టనూలేదు. కాని నువ్విలా నా ఇక

# దేవదాసు

శరత్ బాబు

ఎందుకు చేశావు? బలవంతాన న...
ఊయుకుని—"అమ్మీ! నన్ను ప్రే...
కష్టాల పాలుపుతావు!" అన్నాడు.

చంద్రముఖి చెరుగుతో ము...
కూర్చున్నది. దేవదాసు మరల చెప్ప...

"మీ ఇద్దరిలో ఎంత భేదమ...
ఎంత ఉద్ధృతం, ఎంత అభిమానం; ...
నిగ్రహం. ఆమెలో ఎంత మాత్రం ...
భక్తి! ఆమెకు ఎంత కీర్తి! నీకెంత ...
వారే! ఇక నిన్ను అందరూ అసహ్యిం...
ప్రేమిస్తున్నాను! ఎందుకు ప్రేమించను...
చెప్ప నారంభించాడు: "పాప పుణ్యాల...
శిక్ష విధిస్తాడో నాకు తెలియదు! కాని ...
మిద్దరం కలుసుకోవటం సంభవిస్తే, ...

చంద్రముఖి లోలోపల హృదయ...
"ఏ జన్మలోనైనా, ఎప్పటికైనా ఈ ...
నాకీ వరమే అనుగ్రహించు, భగవంత...
న్సులో ప్రార్థించింది.

★ ★

రెండు మాసాలు గడచినవి. దే...
కాని ఇంకా ఒంట్లో పూరిగా లేదు. గా...
చెప్పాడు. రేపు ధర్మదాసును వెంట బె...

"చంద్ర...
★ అనువ...

"మీకు ఎలానూ ఒక దాసీ కావ...
అని చంద్రముఖి పట్టు పట్టింది.

దేవదాసు ఒప్పుకోలేదు:—"...
అన్నాడు.

చంద్రముఖి ఇక మాట్లాడలేదు...
ఈ మాటలోని అర్థం సహజంగానే గ్ర...
మిగతావి ఎన్ని ఉన్నా గౌరవం మా...
దాసు సుఖపడతాడు. కాని నన్ను...
మౌనంగా ఉండి, కళ్ల తుడుచుకుని...
గలను?" అని అడిగింది.

"చెప్పలేను. కాని నిన్ను ...
నిన్ను చూడాలనే చాపం నా కెప్పు...

చంద్రముఖి అతనికి నమస్క...
పదివేలు. ఇంతకంటె నెక్కువ ఆ...

వెళ్ళేటప్పుడు దేవదాసు ఇం...
ముఖి చేతిలో పెట్టి—"దాచుకో. ...
రకు నువ్వు ఎటూ కాకుండా పోవ...
కూడా గ్రహించి డబ్బు తీసుకు...
నా ఆ ప్రశ్నకు జవాబు చెప్ప ...

...దాసు

...బాబు

...తం

...ముకు బంధించావు?" అని కాసేపు
...నువ్వుకూడా పార్వతి మాదిరిగా

...తప్పుకుని మంచానికి ఒక పక్కన
...చెప్పనారంభించాడు.

...దీ! ఎంత సామ్యమున్నది. ఒకరిలో
...ండవ వారిలో ఎంత శాంతం, ఎంత
...హనంలేదు! ఇక నీలో ఎంత సహన
...ంకం! ఆమెను అందరూ ప్రేమించే
...మకునేవారే! అయినా నేను నిన్ను
...?" అని, దేవదాసు నిట్టూర్చి మళ్ళీ
...ను విచారించే భగవంతుడు నీ కేమి
...పుచుపోయిన తర్వాత మళ్ళీ మన
...న్ను విడిచిపెట్టి ఉండను."

...యం కరిగిపోయేటట్టు ఏడ్చింది.—
...పాపిష్ఠురాలి పాపం పరిహారమైతే
...డా!" అని దేవుని ఉద్దేశించి మన

★ ★

...వదాసుకు ఆరోగ్యం కలిగించింది
...లి మార్పు అవసరమని డాక్టరు
...ట్టుకొని అలహాబాదు వెళ్లతాడు.

...స్తా ది"
...దం ★

...లి: నన్ను వెంట రానివ్వండి."

...నేను అంత సిగ్గు విడవలేను."

...ఆమె తెలివి తక్కువది కాదు,
...హించింది. ఆమెకు ఈప్రపంచంలో
...లేదు. ఆమె వెంట ఉంటే, దేవ
...పొందలేదు. చంద్రముఖి కాసేపు
...మళ్ళీ మిమ్మల్ని ఎప్పుడు చూడ

...ం నేను బ్రతికుండగా మరచిపోను.
...చల్లారదు."

...రించి ఎడంగా పోయి—"నాకిదే
...చను." అని మెల్లగా అనుకున్నది.

...రెండు వేల రూపాయలు చంద్రి
...వ శరీరాన్ని నమ్మకూడదు. చివ
...మో!" అన్నాడు. చంద్రముఖి ఇది
...త్వాత కళ్ల తుడుచుకుని—"మీరు
...గా?" అని అడిగింది.

"ఏమిటి?" అన్నాడు దేవదాసు చంద్రముఖి వంక చూస్తూ.

"మీ ఒంట్లో చెడు జబ్బుల ప్రవేశించా యని మీ వదినె చెప్పింది. నిజమేనా?"

ప్రశ్న విని దేవదాసు చాలా వ్యధ పడ్డాడు—"వదినె ఏదైనా చెప్పుతుంది! కాని ఉంటే నీకు తెలియనా? ఒక్క విషయంలో నువ్వు పార్వతి కంటే మిగులు."

"బ్రతికాను." అని చంద్రముఖి ఇంకో మారు కళ్ల తుడుచుకుని—"అయినా మీరు కొంచెం జాగ్రత్తగా ఉండండి. అసలే మీ ఒంట్లో బాగా లేదు. ఎప్పుడన్నా పొరపడతా రేమో!" అన్నది.

దేవదాసు జవాబుగా నవ్వాడు. మాట్లాడలేదు.

"ఇంకో భిక్ష—ఒంట్లో ఏమాత్రం బాగా ఉండక పోయినా నాకు కబురు చేస్తానని మాట ఇవ్వండి."

దేవదాసు చంద్రముఖి వంక చూస్తూ, తల తిప్పి —"ఎందుకు చేయను అమ్మీ!" అన్నాడు.

చంద్రముఖి ఇంకోమాటు నమస్కరించి ఏడుస్తూ ఇంట్లోకి వెళ్లింది.

## ౧౬

కలకత్తా వదలిన తర్వాత దేవదాసు కొన్నాళ్లు అలహాబాదులో ఉన్నాడు. అక్కడ ఉంటూ ఉండగా ఒకనాడు చంద్రముఖికి ఇలా ఉత్తరము వ్రాశాడు:

"అమ్మీ! ఇక నెపుడూ ఎవ్వరినీ ప్రేమించ కూడదని నిశ్చయించుకున్నాను. ప్రేమించి ఉత్త చేతులతో తిరిగి రావటం ఎవరికైనా చాలా బాధిస్తుంది. ఆ పైన నాదేనని ప్రేమించ బోవటంకంటే గొప్ప వంచన ఈ ప్రపంచంలో మరొకటి లేదు."

చంద్రముఖి దీనికి ఏమి జవాబు రాసిందో మనకు అనవసరం. కాని చంద్రముఖిని ఇక్కడకు పిలిస్తే బాగుంటుందని దేవదాసు అప్పుడప్పుడు అనుకుంటూ ఉండే వాడు. మళ్ళీ పార్వతికి తెలుస్తుందేమో! అని భయపడుతూ ఉండేవాడు.

ఇలా ఒకమాటు చంద్రముఖీ, మరోమాటు పార్వతీ,అతని హృదయ రాజ్యంలో నివసిస్తూ ఉండేవారు. ఎప్పుడన్నా వారిద్దరి ముఖాలూ—వారికి ఎంతో స్నేహ మున్నదన్నట్టుగా—అతని హృదయ పటం మీద దగ్గర దగ్గరగా అంకిత మయ్యేవి; కలుసుకు పోయేవి. ఒక్కొక్కప్పుడు దేవదాసుకు వారిద్దరు నిద్రపోతున్నారా, అని అనిపించేది. ఆ సమయంలో అతని హృదయం శూన్యంగా ఉండేది; నీరసంగా ఉండేది. ఏదో ఒక జీవం లేని అసంతృప్తి మిధ్యాప్రతిధ్వనివలె అతని మనస్సులో తిరుగుతూ ఉండేది.

దేవదాసు అక్కడి నుంచి లాహోరు బయలుదేరాడు; చున్నీలాలు అక్కడనే ఉద్యోగం చేస్తున్నాడు. అతను ఉండేచోటు తెలుసుకుని ఇంటికి వెళ్ళాడు. చాలా కాల మైనాక మిత్రులు ఒకరి నొకరు చూచుకుని సిగ్గు పడ్డారు; సంతోషపడ్డారు. మళ్ళీ దేవదాసు సురాదేవిని ఆరాధించాడు.

దేవదాసుకు చంద్రముఖి మద్యం అంటుకో వద్దని హెచ్చరించిన సంగతి జ్ఞాపకం వచ్చేది. ఆమె ఎంత తెలివి కలది, ఎంత ధైర్యం కలది! అని అతను అనుకునేవాడు. పార్వతి ఇప్పుడు నిద్రపోతున్నది; ఆరిపోయే ముందు దీపం మాదిరిగా ఎప్పుడన్నా భగ్గున వెలిగేది.

మధ మధ్య దేవదాసుకు జబ్బు చేస్తున్నది: పొట్టలో నొప్పిగా ఉన్నట్టు ఉండేది. ఒక ధర్మదాసు ఏడుస్తూ—"మీకు మళ్ళీ జబ్బు చేస్తుంది! ఎక్కడకన్నా వెళ్లదాము పదండి బాబుగారూ!" అన్నాడు.

దేవదాసు అన్యమనస్కంగా—"అలాగే వెళ్దాము" అన్నాడు.

దేవదాసు ఇనలో ఉండగా మద్యం తాగేవాడుకాదు. ఎప్పుడయినా చున్నీలాలు వస్తే తాగేవాడు; లేకపోతే బయటకు వెళ్ళి పోయేవాడు. తెల్లవారుతూ ఉండగా ఇనకు వచ్చేవాడు; ఒకో రోజున వచ్చేవాడుకాదు. ఇవ్వాళకు రెండు రోజులనుంచి ఇంటికి రాలేదు. ధర్మదాసు ఈ రెండు రోజులు అన్నం నీరూ ఎరగడు; ఏడుస్తూనే ఉన్నాడు. మూడోనాడు దేవదాసు పుష్టైదు జ్వరంతో ఇంటికి వచ్చాడు. ఆ పడక పడక కొన్నాళ్లు పాటు లేవలేదు. ముగ్గురు నాలుగురు డాక్టర్లువచ్చి చికిత్స చేయ నారంభించారు.

"అమ్మగారికి కబురు చేయనా, బాబూ" అని ధర్మదాసు అడిగాడు. తల్లి కాశీలో ఉంటున్నది.

"వద్దు ధర్మా! నేను ఈ స్థితిలో తల్లికి ముఖం ఎలా చూపించ గలను!" అన్నాడు.

"రోగాలూ కష్టాలూ అందరికీ వస్తాయి. ఇలాంటి అవసరాలోకూడా తల్లికి తెలుపకుండా ఉండటమా! మీరు విడియవలకండి బాబుగారూ, కాశీ వెళ్దాము."

దేవదాసు ముఖం తిప్పుకుని—"ఇప్పుడు కాదులే ధర్మా, నయమయినాక చూసుకుందాం." అన్నాడు.

ధర్మదాసు ఒక మాటు చంద్రముఖిని జ్ఞాపకం చేద్దామా అనుకున్నాడు. కాని అతనికి చంద్రముఖి అంటే అసహ్యం. అందేత ఆ పేరు ఎత్తలేదు.

దేవదాసుకూడా ఈ సంగతి చాలా సార్లు అనుకున్నాడు. కాని బయటపెట్టటానికి ఇష్టంలేదు. అందుకని ఈ ఊసు ఎవ్వరూ తేలేదు. తర్వాత దేవదాసుకు నెమ్మదిగా ఆరోగ్యంకలిగింది. ఒకనాడు ధర్మదాసుతో "ధర్మా, ఎక్కడకన్నా మళ్ళీ వెళ్దామా!" అన్నాడు.

"ఎక్కడకు వెళ్ళినా లాభంలేదు బాబూ! ఇంటికన్నాతల్లిగారి దగ్గరకన్నా వెళ్దాము పదండి." అన్నాడు ధర్మదాసు.

సామానంత కట్టి చున్నీలాలు దగ్గర సెలవు తీసుకుని దేవదాసు మళ్ళీ అలహాబాదు వచ్చాడు. ఒంట్లో బాగా ఆరోగ్యంగానే ఉన్నది. ఇక్కడ కొన్నాళ్ళు గడిపినాక—"ధర్మా, ఏదన్నా కొత్త చోటుకు పోకూడదా? బొంబాయి నే నెప్పుడూ చూడలేదు వెళ్దామా?" అన్నాడు, ధర్మదాసుతో.

తనకు ఇష్టం లేకపోయినా, దేవదాసు పట్టుదలచూసి, ధర్మదాసు ఒప్పు కున్నాడు. అది జ్యేష్ఠ మాసం. బొంబాయిలో ఎండలు అంత విశేషంగాలేవు. దేవదాసు ఇక్కడకు వచ్చినాక బాగుపడ్డాడు. కొన్నాళ్ళు గడచినాక ధర్మదాసు—"ఇక ఇంటికి వెళ్ళకూడదా బాబూ?" అని దేవదాసును అడిగాడు.

"ఇప్పుడు వద్దు. నా కిక్కడే బాగుంది, కొన్నాళ్ళపాటు ఉంటాను." అన్నాడు దేవదాసు.

★ ★ ★ ★

ఒక సంవత్సరం గడిచింది. భాద్రపద మాసంలో ఒకనాటి ఉదయాన దేవదాసు ధర్మదాసు భుజంమీద భారంవేసి బొంబాయిలోని ఒక ఆసుపత్రినుంచి బసకు తిరిగి వచ్చాడు.

"ఇప్పుడైనా అమ్మ దగ్గరకి పోవటం మంచిదను కుంటాను బాబూ!" అన్నాడు ధర్మదాసు.

దేవదాసు కళ్ళల్లో నీరు తిరిగింది. కొన్నాళ్ళ నుంచి అతనికి ఎప్పుడూ తల్లే జ్ఞాపకం వస్తున్నది. ఆస్పత్రిలో పండుకుని అత నెప్పుడూ—"ఈ ప్రపంచలో నాకు అందరూ ఉండి కూడా ఎవ్వరూ లేరు; తల్లి ఉన్నది, అన్న ఉన్నాడు, సోదరికంటె కూడా ముఖ్యమైన పార్వతి ఉన్నది—చంద్రముఖి ఉన్నది. అందరూ ఉన్నారు. కాని, నేనే ఎవరికీ కాను!" అని అనుకుంటూ ఉండేవాడు.

"అయితే తల్లి దగ్గరకే పోవటం స్థిరపరిచారా బాబూ?" అన్నాడు ధర్మదాసు ఏడుస్తూ. దేవదాసు ముఖం చాటు చేసుకుని, కళ్ళు తుడుచుకున్నాడు.

"లేదు ధర్మా! తల్లికి ముఖం చూపించాలని లేదు. బహుశా ఆ ఘడియ ఇంకా రాలే దనుకుంటాను."

వృద్ధ ధర్మదాసు వెక్కి వెక్కి ఏడుస్తూ—"ఇంకా తల్లి బ్రతికి ఉందిగా బాబూ!" అన్నాడు.

ఈ మాటలో ఉన్న ధ్వని ఇద్దరూ పూర్తిగా గ్రహించారు.

దేవదాసు స్థితి నానాటికీ తీసికట్టుగా ఉన్నది. ప్లీహమూ కాలేయమూ పొట్టనంతా కమ్మివేసినవి; ఆ పైన దగ్గూ జ్వరమూ. శరీరం నల్లబడింది. ఎముకలు లెక్కపెట్ట వచ్చును. కళ్లు పీక్కుపోయినవి—కాని అస్వాభావికమైన తెలుపుతో తళ తళ మెరసిపోతున్నవి. తల వెండ్రుకలు పీచుమాదిరిగా లేచినవి—ప్రయత్నిస్తే లెక్కకూడా పెట్టవచ్చు. వేళ్ళ వంక చూస్తే అసహ్యంకూడా వేస్తున్నది—అసలే ఎంత... నవిస్తున్న ప్రాణులు...

స్టేషను దగ్గరికి వచ్చినాక—"టిక్కెట్టు ఎక్కడికి తీసుకోమంటారు, బాబూ!" అని ధర్మదాసు అడిగాడు.

దేవదాసు కొంచెం ఆలోచించి—"ముందు ఇంటికి పోదాము పద, తర్వాత ఆలోచించుకోవచ్చు." అన్నాడు.

హుగ్లీకి టిక్కెట్లు తీసుకుని బండిరాగానే ఎక్కారు. ధర్మదాసు, దేవదాసు దగ్గరనే ఉన్నాడు. సాయంకాలానికి కళ్ల మంటలతోపాటు దేవదాసుకు మళ్ళీ జ్వరం వచ్చింది.

"ఇక యింటికి చేరేదాకకూడా నమ్మకంలేదు ధర్మా!" అన్నాడు దేవదాసు.

"అలా అంటారేం బాబూ!" అన్నాడు ధర్మదాసు భయపడుతూ.

దేవదాసు నవ్వు తెచ్చుకోవాలని వృథా ప్రయాసపడి—"మళ్ళీ జ్వరం వచ్చింది, ధర్మా," అన్నాడు.

రైలు కాశీ దాటి ఇంకా కొంత దూరము పోయేవరకూ దేవదాసు ఒళ్ళు తెలియకుండానే పడి ఉన్నాడు. పాట్నా సమీపంలో అతనికి తెలివి వచ్చింది.

"అనుకున్నంత అయింది ధర్మా. అమ్మను చూడటం నిజంగానే పడలేదు!" అన్నాడు దేవదాసు.

"ముందు పాట్నాలో దిగండి బాబూ, ఎవరన్నా డాక్టరుకి చూపిద్దాం"

"ఇక్కడ వద్దు ధర్మా. ముందు ఇంటికి పోదాముపద."

బండి 'పాండువా' స్టేషనుకు వచ్చే వరకు తెల్లవారింది, రాత్రంతా వర్షం కురిసి ఇప్పుడే వెలసిన లక్షణాలు కనపడుతున్నవి. దేవదాసు లేచి నిలబడ్డాడు. ధర్మదాసు ఇంకా నిద్రపోతూ ఉన్నాడు. దేవదాసు నెమ్మదిగా అతని ముఖాన చెయ్యి పెట్టాడు. కాని అతన్ని లేపటానికి బిడియపడి మెల్లగా తలుపుతెరచి బండి దిగాడు. నిద్రిస్తూ ఉన్న ధర్మదాసుతో సహా బండి ముందుకు సాగింది.

వణుకుతూ వణుకుతూ దేవదాసు స్టేషనుదాటి, ఒక గుర్రపువాణ్ణి పిలిచి—"హాతీపోతాకు బండి కడతావా?" అనిఅడిగాడు.

వాడొక మాటు దేవదాసు ముఖంవంక చూసి, కాసేపు దిక్కులు పరికించి—"రాస్తా మంచిదికాదు బాబూ. వర్షా కాలంలో గుర్రపుబండి అక్కడికి పోలేదు." అన్నాడు.

దేవదాసు ఉద్విగ్నుడై—"పల్లకీ దొరుకుతుందా?" అని అడిగాడు,

"దొరకదు బాబూ!"

అయితే ఇక పోవటం పడదా? అనే సందేహంతో దేవదాసు కూర్చొనిపోయాడు. అతని ముఖం మీద, అంతిమ చిహ్నాలు అచ్చు గుద్దినట్టుగా కనపడుతున్నవి—గుడ్డివాడు కూడా చదవ గలడు! బండివానికి జాలి కలిగింది.

"ఎడ్ల బండి మాట్లాడిపెట్టమంటారా, బాబూ?" అని అడిగాడు.

"ఎప్పటికి చేరుతుంది?"

"దోవ సరిగా లేదు బాబూ, రెండు రోజులు పట్టుతుం దనుకుంటాను."

ఇంకా రెండు రోజుల దాకా నేను బ్రతికి ఉంటానా? అని దేవదాసు మనస్సులో గుణించుకున్నాడు. కాని అతను పార్వతి దగ్గరికి పోకతప్పదు. చిన్నతనం నుంచీ అతను ఆమెతో ఆడిన అబద్ధాలన్నీ జ్ఞాపకం వచ్చినవి. కాని ఆఖరుతఫా అతను ఆమెకు యిచ్చిన మాట నెరవేర్చ వలసిందే: ఎలాగైనా సరే, ఆమెను కడసారి చూపు చూడవలసిందే. కాని జీవితావధి సమీపించింది: ఇదే భయపడవలసిన విషయం!

దేవదాసు ఎడ్లబండి ఎక్కాడు. తల్లి జ్ఞాపకం వచ్చి అతని కళ్ళ వెంట నీరు ధారగా కారింది. ఇంకో ముఖం కూడా ఈ అంతిమ దశలో అతనికి మహా పవిత్రంగా కనిపించింది—అది చంద్రముఖిది! పాపిష్ఠురాలని అతను ఎవరినైతే మొదటినుంచీ ఏవగిస్తూ వచ్చాడో, ఆమె ఈనాడు తల్లితోపాటు తలపుకు రావటం చూసి అతని కళ్ళ వెంట అశ్రువులు రాలినవి. ఇక ఈ జీవితంలో ఆమె కనపడదు. బహుశా చాలా కాలం వరకు ఆమె ఈ సంగతే తెలుసుకోలేదు. అయినా అతను పార్వతి దగ్గరకే వెళ్ళాలి! ఇంకోమాటు కనపడతానని అతను మాట ఇచ్చాడు! ఈ మాట తప్పకూడదు: నెరవేర్చ వలసిందే!

దోంక బాగా లేదు. వర్షపు నీరు అక్క డక్కడ గుంటల్లో నిల్చి ఉన్నది. ఎక్కడన్నా గట్లు కూడా పడినవి. దోవంతా బురద. బండి పూటీల వరకూ దిగబడుతూ ఉన్నది. అప్పు డప్పుడూ బండివాడు దిగి చక్రం ఎత్తివేయవలసి వస్తున్నది; ఎడ్ల తోకలు మెలి నేసి [illegible]యగా కొట్టవలసి వస్తున్నది. ఎన్ని తంటాలు పడైనా సరే, ఈ పదహారు కోసులు దాటాలి!

రంయ్ మని చలి గాలి వీస్తూ ఉన్నది. ఇవ్వాళ సాయంత్రంకూడా దేవదాసుకు బాగా జ్వరం వచ్చింది. అతను భయపడుతూ—"అబ్బీ ఇంకా ఎంత దూరం ఉంది?" అని అడిగాడు.

"ఇంకా పది కోసు లుంది బాబూ!"

"త్వరగా తీసుకెళ్ల నాయనా! నీ కెంత డబ్బయినా ఇస్తాను" అని జేబులోనుంచి పంచ రూపాయల కాగితం ఒకటి తీసి—"పంచ రూపాయలిస్తాను, దబ్బున చేర్చు" అన్నాడు.

తర్వాత దేవదాసుకు ఆ రాత్రి ఏవిధంగా గడిచిందో తెలియ లేదు. ఒళ్ళు తెలియకుండా పడిపోయినాడు. ఉదయం తెలివి రాగానే— "అబ్బీ, ఇంకా ఎంత దూర ముంది?" అని అడిగాడు.

"ఇంకా ఆరు కోసులు బాబూ!"

దేవదాసు నిట్టూర్చి—"కాస్త త్వరగా తీసుకెళ్ల నాయనా, నా కిక వ్యవధి లేదు. గడువు సమీపించింది" అన్నాడు.

బండివానికి ఏమీ అర్థం కాకపోయినా, నూతనోత్సాహంతో ఎడ్లను బూతులు తిడుతూ అదలింప నారంభించాడు. ఎడ్లు శక్తి కొలది నడుస్తున్నవి. లోపల దేవదాసు మహా వ్యాకులపడు తున్నాడు. అతనికి ఒకటే ఆలోచన—చూడటానికి పడుతుందా? చేరగలనా? అని.

మధ్యాహ్నం బండివాడు బండిని ఆపి ఎడ్లను విప్పి మేత వేశాడు. చద్దిమూట విప్పి తాను భోంచేయటానికి కూర్చుని—"బాబుగారూ, మీరేమి తినరా?" అని దేవదాసును అడిగాడు.

'తినను అబ్బీ. కాని చాలా దాహం వేస్తున్నది. కాసిని మంచినీళ్ళు తెచ్చిపెట్టగలవా?'

బండివాడు డొంక పక్కన ఉన్న చెరువుకు పోయి నీళ్ళు తెచ్చి యిచ్చాడు.

ఇవ్వాళ సాయంత్రం జ్వరంతోపాటు దేవదాసు ముక్కుల్లోనుంచి ఒక్కొక్క బొట్టు నెత్తురుకూడా పడ నారంభించింది. అతను ప్రాణాలన్నీ ఒడ్డి ముక్కు బిగించి పట్టుకున్నాడు, తర్వాత పళ్ళ చిగుళ్ళలోనుంచి రక్తం రావటానికి ప్రయత్నిస్తున్నట్టుగా అతనికి తోచింది. కొంచెం ఎగశ్వాసకూడా పుట్టింది.

దేవదాసు ఆయాసంతో—'ఇంకా ఎంత దూరముంది' అని బండివాణ్ణి అడిగాడు.

'ఇంకా రెండు కోసులు, రాత్రి పది గంటలకు చేరుతాము.'

దేవదాసు చాలా కష్టంతో తలఎత్తి దోవవంకచూసి—'భగవంతుడా!' అన్నాడు.

'ఎందుకలా అంటారు బాబూగారూ!' అన్నాడు బండివాడు.

దేవదాసు ఈ ప్రశ్నకు జవాబివ్వలేక పోయినాడు. బండి సాగి పోతూనే ఉన్నది. కాని అతను చెప్పినట్టు పది గంటలకు కాకుండా రాత్రి పన్నెండు గంటలకు హాతీపోతా జమీందారుగారి దేవిడీ ముందున్న రావిచెట్టు క్రింద ఆగింది.

'దిగండి బాబూగారూ!' అని బండివాడు దేవదాసును పిలిచాడు.

జవాబులేదు. మళ్ళీ పిలిచినా మారులేదు. అప్పుడు వాడు భయపడి దేవదాసు ముఖం దగ్గరికి దీపం తీసుకువచ్చి—'నిద్ర పోతున్నారా బాబుగారూ?' అన్నాడు.

దేవదాసు చూస్తూనే ఉన్నాడు. పెదవులుకూడా కదిలించాడు. కాని మాట మాత్రం బయటికి రాలేదు.

'ఓ బాబుగారూ!' అన్నాడు మళ్ళా బండివాడు.

దేవదాసుచెయ్యి ఎత్తాలను కున్నాడు; కాని లేవలేదు. అతని కనుకొలకుల వెంట రెండు అశ్రు బిందువులు జారినవి. బండివాడు అప్పుడు తన బుద్ధినంతా వినియోగించి రావిచెట్టు చుట్టూ కట్టిన దిమ్మెమీద గడ్డితో పక్క పరిచాడు. తర్వాత చాలా ప్రయాసతో దేవదాసును ఎత్తి దానిమీద పండుకో బెట్టాడు.



బయట ఒక పురుగుకూడా లేదు, జమీందారుగారి ఇల్లు, నిశ్శబ్దంగా నిద్రిస్తూ ఉంది. దేవదాసు మహా కష్టంతో జేబులోనుంచి పంచ రూపాయల కాగితం తీసి బండివాడికి ఇచ్చాడు. దేవదాసు తన వంకనే చూస్తూ ఉండటం, ఆ లాంతరు వెలుతురులో బండివాడు చూశాడు. కాని అతనేమీ చెప్పలేకుండా ఉన్నాడు. అతని స్థితి గ్రహించి బండివాడు [illegible] [illegible] [illegible] కూర్చున్నాడు; చాలా సేపటికి దేవదాసు [illegible] లాంతరు ఏమిటనే వెలుగుతూ ఉంది. కొత్త [illegible] దేవదాసు కాళ్ళ దగ్గర కూర్చుని ఆలోచిస్తున్నాడు.

తెల్లవారింది. జమీందారు ఇంట్లోనుంచి మనుష్యులు బయటికి వచ్చి ఈ దృశ్యంచూసి విస్తు పోయినారు—చెట్టుక్రింద ఎవరో మనిషి చని పోయినాడు. పెద్దమనిషి బిడ్డేమీరు బిలువగల శాలువా, కాళ్ళను ఒక ఆ మెరిసే బూట్లు! ఒక్కొక్కరే చాలామంది పోగయ్యారు. క్రమంగా ఈ సంగతి భువనబాబు చెవిదాకా పోయింది, ఆయన డాక్టరుకు కబురు చేసి ఇక్కడకు వచ్చాడు.

దేవదాసు ఒక్కమాటు అందరి వంకా చూశాడు. కాని అతనికి మాటలు పడిపోయినవి. ఏమీ చెప్పలేక పోయినాడు. కళ్ళ వెంట మాత్రం నీరు కారుస్తున్నాడు. బండివాడు తనకు తెలిసినంత వరకు చెప్పాడు. కాని అందువల్ల ఏమీ ఆచూకీ చిక్కలేదు.

ఇంతలో డాక్టరు వచ్చి—"ఎగశ్వాస పెట్టింది, ఇక లాభం లేదు" అని తేల్చాడు.

"అయ్యో, పాపం!" అన్నారు అక్కడ ఉన్నవారంతా.

మేడపైన కూర్చున్న పార్వతి కూడా ఈ సంగతి విని—"అయ్యో పాపం!" అన్నది.

ఎవరో పుణ్యాత్ముడు దయదలచి దేవదాసు నోట్లో ఒక నీటి బొట్టు వేశాడు. దేవదాసు అతని వంక కరుణా దృక్కులతో చూశాడు. అంతే, ఆ తర్వాత కళ్ళు మూయటం-ఇక తెరవనే లేదు.

ఇక ఎవరు దహనం చెయ్యాలి అనే ప్రశ్న కలిగింది. ఎవరు ఉంటుకుంటారు? ఏ జాతి అనే సమస్య మీద కాసేపు చర్చ జరిగింది. భువనబాబు దగ్గర ఉన్న పోలీసు స్టేషనుకు కబురు చేశాడు. ఇనస్పెక్టరు వచ్చి రిపోర్టు వ్రాసుకో నారంభించాడు.

ప్లీహం, కాలేయం పెరగటం వల్ల మృత్యువు; ముక్కూ నోటా నెత్తురు దాగులు; జేబులో రెండు ఉత్తరాలు దొరికినవి. ఒకటి రాక్సోనాపురంలో ఉన్న ద్విజదాసు ముఖర్జీ బొంబాయిలో ఉన్న దేవదాసు ముఖర్జీకి రాశాడు—'ఇకడబ్బుపంపటంఅసంభవం,'అని. రెండవదికాశీలో ఉన్న హరిమతీ దేవి దేవదాసు ముఖర్జీకి, 'ఎలా వున్నావు?' అని రాసింది. కుడిచేతిని అతని పేరు ఇంగ్లీషు పొడి అక్షరాల్లో పచ్చ పొడిచి ఉన్నది. ఇనస్పెక్టరు ఇవన్నీ పరీక్షించి అతను తప్పక దేవదాసేనని తేల్చాడు.

వ్రేలిని ఒక నీలం తాపిన ఉంగరం—ధర సుమారు 150 రూపాయలు, శాలువాలు రెండు—ధర రెండు వందల రూపాయలు, ఇంకా చొక్కా ధోవతీ, ఇనస్పెక్టరు ఇవన్నీ లెక్క రాసుకున్నాడు.

భువనబాబూ మహేంద్రుడూ అక్కడనే ఉన్నారు. రాక్సోనాపురం మాట విని మహేంద్రుడు—'పిన్నిది ఆ ఊరే. ఆమె చూస్తే—' అన్నాడు.

'ఇక్కడ శవాన్ని గుర్తించటానికి వస్తుందా ఏమిటి మీ పిన్ని?' అని భువనబాబు మహేంద్రుని గద్దించాడు.

'చాదస్తు దంటే ఇలాంటివాడే!' అన్నాడు ఇనస్పెక్టరు నవ్వుతూ.

బ్రాహ్మణుని శవమైనా ఆపల్లెటూళ్లో అగ్రజాతులవారెవరూ సంస్కారము చేయటానికి ఇష్టపడలేదు. వెట్టివాళ్లు వచ్చి కట్టుకు పోయారు. వాళ్ల ఆ శవం సరిగ్గా తగలబడక ముందే వదలిపెట్టి వెళ్లిపోయారు. కాకులూ, గద్దలూ వచ్చి శవం మీద వాలినవి. కుక్కలూ నక్కలూ శవం కోసం కీచులాడినవి. అప్పుడు కూడా విన్నవాళ్లంతా 'అయ్యో పాపం,' అన్నారు.

దివాణంలో ఉన్న దాస దాసీ లందరూ ఈసంగతే చెప్పుకో నారంభించారు:

"అయ్యో పాపం, కులీనుడు, ధనవంతుడు! రెండువందల రూపాయల శాలువాలూ, నూటయాభై రూపాయల ఉంగరం. అన్నీ ఇన్స్పెక్టరుగారి దగ్గరే ఉన్నాయి. ఉత్తరాలు రెండు కూడా వారే తీసుకు వెళ్ళారు."

ఈ సంగతి పార్వతికి ఉదయమే తెలిసింది. కాని ఇప్పు డామె ఏవిషయంలోనూ అంతగా కుతూహలం చూపించటం లేదు; అందువల్ల వివరాలు తెలుసుకో లేదు. కాని ప్రతివాళ్ల నోటా ఈ మాట వింటూ ఉండడంచేత పార్వతి సాయంత్రం ఒకదాసీని పిలిచి—"ఏమిటే సంగతి? వచ్చింది ఎవరు?" అని అడిగింది.

'అయ్యో! ఎవరికి తెలుసు తల్లీ,పూర్వజన్మలో ఈగడ్డను కొనిఉంటాడేమో అందుకనే ఇక్కడకు వచ్చి చావటానికి వచ్చాడు. చలిలో మంచులో రాత్రంతా ఇక్కడనే పడి ఉన్నాడు. ఇవ్వాళ తొమ్మిది గంటలకు చచ్చిపోయాడు."

పార్వతి నిట్టూర్చి—"అయ్యో పాపం! ఇంతకూ అతనెవరో తెలియనే లేదా?" అని అడిగింది.

"చిన్నబాబు గారికి అంతా తెలుసును, నాకు బాగా తెలియదమ్మా."

మహేంద్రునికి కబురు చేస్తే అతను వచ్చి—"మీ ఊరువాడే, దేవదాసు ముఖర్జీ" అని చెప్పాడు.

పార్వతి మహేంద్రుని దగ్గరకు వచ్చి అతనివంక తీక్షణంగా చూస్తూ—'ఏమిటీ దేవదాదా! ఎలా తెలుసుకున్నావ్?' అన్నది.

"జేబులో రెండు ఉత్తరాలు దొరికాయి, ఒకటి ద్విజదాసు ముఖర్జీ రాశాడు—"

"ఆఁ, ఆయన అన్న" అన్నది పార్వతి మధ్యనే అడ్డి,

"ఇంకో ఉత్తరం కాశీనుంచి హరిమతీదేవి రాసింది—"

"ఆఁ, ఆమె తల్లి."

"చేతిమీద పేరు పచ్చ."

"ఆఁ, మొట్ట మొదట కలకత్తా వెళ్ళినప్పుడు పొడిపించుకున్నాడు."

"వేలిని ఒక నీలం ఉంగరం—"

'ఆఁ, వడుగునాడు పెదబాబు ఇచ్చాడు. ఇక నేను వెళ్తాను.' అంటూ పార్వతి దబ దబ పైనుంచి దిగింది. మహేంద్రునికి ఏమీ పాలు పోలేదు.

'పిన్నీ ఎక్కడికి వెళ్ల దున్నావు' అని అడిగాడు.

"దేవదాసు దగ్గరకు"

'అతను లేడు. ఎప్పుడో వెట్టివాళ్ళు తీసుకు వెళ్ళారు.'

"అమ్మో, నాయనో!" అని ఏడుస్తూ పార్వతి పరుగెత్త నారంభించింది. మహేంద్రుడు అడ్డి—"నీ కేమన్నా పిచ్చా, అమ్మా! ఎక్కడికి వెళ్తావు?' అన్నాడు.

పార్వతి మహేంద్రునివంక తీక్షణంగా చూసి—'మహేన్, నేను పిచ్చిదాన్ని అనుకొంటున్నావా? దోవ వదులు' అని గద్దించింది.

ఆమె కళ్లు చూసి మహేంద్రుడు దోవ వదిలి ఆమె వెను వెంటనే పోనారంభించాడు. పార్వతి బయటకు వచ్చేసింది. అప్పుడు కచ్చేరీలో గుమాస్తాలూ ముసద్దీలూ ఇంకా పనిచేస్తూనే ఉన్నారు. వాళ్లంతా ఈమెను చూశారు. చౌదరి గారు కూడా కళ్లజోడుపైనుంచి చూసి— "ఎవరా వెళ్లేది?' అని అడిగాడు.

"పిన్ని" అన్నాడు మహేంద్రుడు.

'అదేమిటి! ఎక్కడికి పోతున్నది?'

'దేవదాసును చూడటానికి.'

'మీ అందరికీ పిచ్చి ఎక్కిందా ఏమిటి? పట్టుకోండి, పట్టుకోండి. పిచ్చి ఎక్కింది! ఓ మహేన్! ఓ అమ్మా!' అని భువన చౌదరి చీత్కారం చేశాడు.

తర్వాత దాస దాసీ లందరూ కలిసి పార్వతి మూర్ఛిత దేహాన్ని ఇంట్లోకి తీసుకుపోయారు. పార్వతికి మర్నాడు స్మృతి వచ్చింది, కాని ఎక్కువ మాట్లాడలేదు. ఒక దాసీని పిలిచి—'రాత్రి రాలేదా? రాత్రంతా!' అని అడిగింది.

అంతే. పార్వతి ఇక మాట్లాడలేదు.

* * * * *

ఇప్పుడు, ఇంతకాలమైనాక పార్వతి ఏమయిందో ఎలా ఉన్నదో నాకు తెలియదు. తెలుసుకోవాలనే కోరిక కూడా లేదు నాకు. దేవదాసును గురించే నాకు చాలా దుఃఖంగా ఉంటుంది. ఈ కథ చదివితే, బహుశా, మీకు కూడా నా మాదిరిగానే దుఃఖం కలగవచ్చు. అయినా, దేవదాసు వంటి దౌర్భాగ్యులతో, నిగ్రహం లేనివారితో, పాపిష్ఠులతో ఎప్పుడైనా మీకు పరిచయం కలిగితే, వాళ్లకోసం మీరు కొంచెం ప్రార్థించండి. కనీసం అతని వంటి చావు మాత్రం ఎవ్వరికీ రాకూడదని కోరండి! మరణం వల్ల పెద్ద నష్ట మేమి లేదు. కాని, ఆసమయంలో ప్రేమపూరితమైన కరస్పర్శ లలాటానికి సోకాలి; ఆఖరికి, ఒకరైనా కరుణాపూరిత ముఖాన్ని చూస్తూ ఈ జీవితం అంతం కావాలి; చివరికి ఒక్కరి కంటినుంచైనా కన్నీటి బిందువు రాలటం చూసి ప్రాణాలు వదలాలి. చాలు, ఇంతకంటె పెద్ద కోరికలు అనవసరం!

[ అయిపోయింది ]

# ★ లేఖలు ★

## "మేమే నిజమైన కాంగ్రెసు వారము"

### తిరువూరు తాలూకాలో కాంగ్రెస్ మెంబర్ల హడావిడి.

సెప్టెంబరు, అక్టోబరు నెలల్లో తిరువూరు తాలూకాలో కాంగ్రెస్ మెంబర్ల హడావుడి జరిగింది. కొంతమంది జాతీయ జండాలతో బయలు దేరి గ్రామ గ్రామము తిరిగి కాంగ్రెస్ ప్రబోధం చేస్తూ షుమారు 60 గ్రామాల్లో 3000 సభ్యులను చేర్పించారు. మరి కొంతమంది జమీందార్ల సహాయంతో షుమారు నాల్గు గ్రామాల్లో 3000 మందిని చేర్చారు. ఎప్పుడూ పది వందల కంటే ఎక్కువ మెంబర్లు లేని యీ తాలూకాలో 3000 మంది చేరుట చాలా ఆశ్చర్యమే.

20-9-38 తేదీన యీ తాలూకాలోని పెద్ద ఎస్టేటుదారునికి ముగ్గురు కాంగ్రెస్ వారికి యీ విధంగా మురిప్పట్లు జరిగాయట. "అయ్యా మేము నిజమైన కాంగ్రెస్ వాళ్ళం జమీందారులను షావుకార్లను అన్యాయము చేయకుండా వారి క్షేమం ఎల్లప్పుడూ కోరుతూ వుంటాము. ప్రత్యర్థుల పార్టీ కమ్యూనిస్టు తత్వంతో కూడుకొని కాంగ్రెస్ విధానానికే వ్యతిరేకంగా వుంటుంది. వాళ్ళ సోషలిస్టులు. ప్రతి దానికి కలుగజేసు కుంటారు. జమీందార్ల మీద లేని పోని నిందలు వేసి రైతులకు జమీందార్లకు మధ్య, ప్రతి సమస్యను దెబ్బలాటగా మారుస్తారు. గాన మీరు మాకు సహాయంగా ఉంటే తప్పక ప్రత్యర్థుల్ని పట్టి కొట్టించివేస్తాం. అసెంబ్లీలో మెజార్టీ సంపాదించి ఎస్టేటు ల్యాండు అక్టు జమీందార్లకు అనుకూలంగా చేసి శిస్తులు తగ్గకుండా చేస్తాం. ఋణ నివారణ బిల్లును సవరణ చేసి మీకు నష్టము లేకుండా చేస్తాం." అని వారు కోతలు కోసే సరికి జమీందార్లు షావుకార్లు భళీ అంటే భళీ అన్నారు. ఒకరు జిల్లా మెంబరు మరొకరు రాష్ట్రీ కాంగ్రెస్ మెంబరు అవుతామనుకొన్నారు. యిరు తెగలవారికి దివాణంలో విందులు ఆరోజంతా షావుకార్లు జమీందార్లు రు. 300 చందా వేసి 1200 వందల మెంబర్లను చేర్పించటం. గెలుపు నిచ్చి, 40 పుస్తకాలు యిచ్చి తర్లిపోయారు కాంగ్రెస్ పెద్దలు. వెంటనే నౌకర్లను యితర గ్రామాలకు మెంబర్లను చేర్పించుటకు పంపేరు జమీందారుగారు. కాని లాభం లేకపోయింది. స్వగ్రామంలో డబ్బు ఇవ్వనవసరము లేదని సభ్యుల్ని చేర్పించి డబ్బుకు తరువాత నిర్బంధ పెట్టారు. లాభం లేకపోయింది. సంతకం చేసేవారిమీద వేలు ముద్రలు వేసుకున్నారు. మైనార్టీ వెళ్ళిన వార్నీ వెళ్ళనివార్నీ అష్ట కష్టాలు పడి 800, 900 మందిని చేర్పించారు.

ఇదేగాబోలు నిజమైన కాంగ్రెసు వారుల తత్వం. పై వ్యవహారాన్ని తెలుసుకొన్న వారికే నిజమైన కాంగ్రెస్ తత్వం అర్థ మౌతుంది. నిజమైన కాంగ్రెస్ తత్వం జమీందార్లతో చేరి. రైతులకు కూలీలకు ద్రోహము చేయుటే కాబోలు. రైతులకు కూలీలకు జమీందార్ల షావుకార్లవల్ల జరిగే అన్యాయాలు జరుగకుండా చేయుటే కమ్యూనిస్టుతత్వం కాబోలు. యీ పెద్ద కాంగ్రెసు వారిని ఒక వ్యక్తి యిలా అడిగాడట "యేమయ్యా! ఋణనివారణ బిల్లు సవరణ చేస్తాం శిస్తులు హెచ్చింపుతాము అంటారు అంతా మీ యిష్టమేనా? యెంత మెజారిటీ వున్నా కాంగ్రెస్ అంతా మీమ్ముగుసి స్వాధీనమేనా? అవకతవకగా ప్రవర్తించిన కాంగ్రెస్ మంత్రి వర్గాల గతియేమైందో మీకు తెలియదా? వర్కింగు కమిటీమాట మర్చిపోయారా? ఐతే అంతటివారికి దిక్కు లేకుండా పోయిందయ్యా మీగతి అంతే. మీమాటలు యెంతజాగా నమ్మి సభ్యుల్ని చేయస్తామన్నారు వారు. వారికి తెలియకపోతే మీకైనా జ్ఞానంలేదా?" అని అనే సరికి ఆ మొకాళ్ళ దిగువను లాల్చీ తొడిగిన అస్థూలకాయుడు మారు మాటాడకుండా దివాణంలో దూరాడు. ఆనాటినుండి యీ మాటలు అడిగిన వానిపై చర్య తీసుకోవాలని ఆయనస్టేటు దారుని పూహాట.

కార్మిక కర్షక సోదరులారా: పై వ్యవహారాన్ని బట్టి మనకు జరిగే అన్యాయాన్ని గుర్తించాలి. కాంగ్రెస్ సంస్థను జమీందార్లు షావుకార్లు యేవిధంగా వశపర్చుకొనుచున్నారు. అధికార వ్యామోహ పీడితులు, స్వార్థపరులైన కొందరి కాంగ్రెసు వారివల్ల మనకు జరిగే నాశ్యాన్యయమిది. జరిగిన దానికి విచారము వలదు. జరుగబోవు కాంగ్రెస్ యెన్నికలలో నిజమైన కాంగ్రెస్ వారిని గుర్తించాలి. లేనియెడల మనకు జరిగే సాధక బాధకాలకు మనమే బాధ్యులం. కాంగ్రెస్ ప్రతిష్ఠ మీప్రతిష్ఠ మీరే నిలపాలి.

ఇట్లు
తిరువూరు తాలూకా కాంగ్రెసు సేవకుడు.
14—11—38.

★ ★ ★

### బెజవాడ తాలూకా నూతన సబురిజిష్ట్రారు వారి ఆఫీసు.

అయ్యా, బెజవాడ సబురిజిష్ట్రారు ఆఫీసులో పని ఎక్కువగుటయేగాక రాకపోకలలో ప్రజలు వ్యయ, ప్రయాసలకు లోనగుటచే బెజవాడ తాలూకాలో మరొక ఆఫీసు నేర్పరచదలచి లోగడ మైలవరమా, కొండపల్లియా అని విచారించి మైలవరమే మంచిదని కొన్ని ఇండ్లను అద్దెకు కూడా మాట్లాడినట్లు తెలియుచున్నది. ఇప్పుడు బెజవాడ సబు రిజిష్ట్రారు వారిని కొండపల్లిలో ఏర్పరచదలచి కొండపల్లికి అందు చేర్చబోవు గ్రామాదులు ఎంతెంత దూరమున నున్నవో లోగట్టా వేయవలసినదిగా పైవారు ఆజ్ఞాపించినట్లు తెలియుచున్నది. యీ విషయమై 21—11—38 తేదీన బెజవాడ సబు రిజిష్ట్రారువారు కొందరిని విచారించినారు గనుక యీ రెండు ప్రదేశములలోని వ్యత్యాసములు వారికి విశదమైనవే గనుక తగు దానిని నిర్ణయించుట వారి కర్తవ్యమై యున్నది.

కొండపల్లికి బెజవాడ తాలూకాలోని కొన్ని గ్రామాదులు 25 మైళ్ళవరకు దూరము కలిగి యున్నవి. వారు వచ్చుటలో బెజవాడకు కొండపల్లికి గల వ్యత్యాసమేమి కనుపించదు. వీరు ప్రజలు నష్టపడుదురని ఏర్పరచబోవు యీ ఆఫీసు కొండపల్లిలో వుండి యేవిధముగాను వ్యయ ప్రయాసలను తగ్గింపక పోవుటయేగాక లోటున నీటి వసతులలో యిబ్బందిని కలుగజేయును. నీటి విషయములో పక్షపాతమైనను ప్రజలకు చాల ఇబ్బంది కలుగును. ఆరోగ్య విషయమునను మైలవరమునకు తీసిపోవును. యీ విషయములు స్థానికోద్యోగుల వలన ప్రభుత్వం తెలిసికొనవలసి యున్నది. నంది గామ తాలూకాలోని గ్రామాదులు కొన్ని కలిసినను, వారికిని బెజవాడ పోవుట సులువుగాని, కొండపల్లి పోవుట ఎంత మాత్రము కాదు. ఇప్పుడు బెజవాడ మార్గమైనను, ప్రజలు వ్యాపార వ్యవహారములలో కలిసి వచ్చుటచే కొంత సౌకర్య మేర్పడుచున్నది. మార్గస్థులకు వ్యాపార వ్యవహార సౌకర్యములు లేకపోగా తుదకు వసతులకు గూడా బాధ పడవలసి యున్నది.

మైలవరమునకు బెజవాడ తాలూకాలోని చీమలపాడు, కృష్ణారావుపాలెం, మొరుసుమల్లి, ములగలపెంట గూడెం, మాధవరం, చంద్రవరం, నాగులూరులున్నూ, తిరువూరు తాలూకాలోని ఓబులాపురం, తాడిగూడెం, బూరుగుగూడెం, రెడ్డికుంట, వెలగలగూడెం, మనస, మాధవరం గ్రామములు 10 మైళ్ళ దూరములో నున్నవి. కొండపల్లి ఫిర్కాలోని కొన్ని గ్రామములు 10 మైళ్ళలోపున నున్నవి. ప్రజ రాత్రికి తిరిగి యింటికి వెళ్లుటకు వీలగును. మైలవరములో చక్కని నీటివసతి. తిరువూరు బెజవాడల కారు సర్వీసుకు మధ్యయున్న ప్రభుత్వ నిబ్బందికిని ప్రజకును సర్వ విధముల సౌఖ్య ఆరోగ్య స్థలమును. అయివున్నది.

గాన ప్రభుత్వమువారు స్థలనిర్ణయ విషయములో స్థానికోద్యోగులను ప్రజలను సాకల్యముగా విచారించి ప్రజకు కలుగజేయనున్న సౌకర్యమును తగురీతిని ఏర్పరచి మైలవరం కొండపల్లి గ్రామములకుగల వ్యత్యాసములను గమనించ గలందులకు ప్రార్థించుచున్నాను.

యీ విషయములో ప్రజలు ఏమరుపాటును విదనాడి స్థిరముగా వారికి కలుగబోవు కష్టనష్టములను ప్రభుత్వమునకు అర్జీలరూపమున విన్నవించుకొని సక్రమ విచారణ జరిగించునట్లు ప్రభుత్వమును కోరుట వారి కనీస కర్తవ్యమని హెచ్చరించు చున్నాను.

ఇట్లు
ప్రజాసేవకుడు
బెజవాడ 22—11—38.

★ ★ ★

### మద్రాసు రాష్ట్రీ చేనేత పారిశ్రామికుల సహకార క్రయ విక్రయ సంఘం.

అయ్యా, యీ సహకార సంఘమును, దుర్భర కష్టాల ననుభవించు చేనేత పారిశ్రామికుల బాధలను తగ్గించి, మధ్య వర్తులకు పోవు లాభములను నిలువచేసి వీరికి కావలసిన వస్తువులు చౌకగా సరఫరా చేయుచూ, వారు తయారు చేయు వస్తువులు లాభకరంగా విక్రయించి వచ్చిన లాభాన్ని నేత పారిశ్రామికులకే చెందునట్లు చేయాలనే ఉద్దేశంతో 1935 సంవత్సరంలో మద్రాసు రాష్ట్రీ చేనేత పారిశ్రామిక సహకార సంఘము ఏర్పడింది. దీనిలో యిప్పుడు 5622 మంది సభ్యులున్నారు. రు 68359-0-0 ల మూల ధనమున్నది. దీనికి అనుబంధాలుగా అన్ని ప్రాంతాలలోను 97 ప్రాథమిక సంఘాలు ఏర్పడినవి. కేంద్ర సంఘం నుండి అనుబంధ సంఘాలకు వాటి వ్యాపార వ్యయమును బట్టి నెల 1కి 10 రూపాయలు మొదలుకొని రు. 60 రూపాయల వరకు గ్రాంటు ఇచ్చెదరు. రాష్ట్రీ సంఘం యొక్క హామీ మీద కొందరు నూలు మిల్లుల వర్తకులు లోను ధరలకు యీ అనుబంధ సంఘాలకు నూలు సరఫరా చేయుదురు.

యీ సొసైటీలలో 1937 జూన్ నెల ఆఖరు నుండి 1938 మార్చి 31 వ తేదీకి 350154 గజముల గుడ్డ తయారైనవి. 317990 గజముల గుడ్డ అమ్మినారు. గ్రామ్యాధి మాసము లలో యింత గుడ్డ తయారైతే ఇప్పటి పరిస్థితులలో సంవత్సరానికి 5 లక్షల గజాల గుడ్డ తయారై యీ సొసైటీల ద్వారా విక్రయించ బడుటకు అవకాశమున్నది. మన రాష్ట్రములో చేనేతకు మగ్గానికి 5 గజాల చొప్పున తయారైతే సంవత్సరానికి 36 కోట్ల గజముల గుడ్డ తయారగుటకు అవకాశమున్నది. కాని ఇంత వరకు మన రాజధానిలో ఎన్ని ప్రాథమిక సొసైటీ లున్నవో తెలుస్తుంది. అనగా 4000 ప్రాథమిక సంఘాలుండవలెయును. ఇన్ని సంఘాలు రాజధాని అంతటా ఏర్పడితే మలమల మాడుతూ యున్న నేత పారిశ్రామికులకు అంటానికి తిండి దొరుకుతుంది. యిందుకు కాంగ్రెసు మంత్రి వర్గమువారు ఈ కష్ట జీవులను పూర్తి చేయూత నిస్తారని నమ్ముచున్నాము.

ఇట్టి సమవాయములను ఈ పరిశ్రమకు కలిగించ వలయుననే ఉద్దేశంతో రాష్ట్రీయ సంఘాన్ని ప్రభుత్వంవారు స్థాపించిరి. కాని పారిశ్రామిక కానుభవము లేని కొందరు స్వార్థపరుల నాయకత్వమున నుండుటచే అట్టి ఉద్దేశము నెరవేరకుండా పోతోంది. అతి కష్టం మీద షేర్లను కొని ఒక సహకార సంఘాన్ని స్థాపించుకొనినను రాష్ట్రీయ సంఘంవారు మంజూరు చేసిన ధనమును డబ్బు లేదను మిషతో నిరాకరించు చున్నారు. వారిచ్చు నచ్చిదీలు అతి స్వల్పమైనను 3 నెలల కొకసారి తగ్గించు చున్నారు. మన రాష్ట్రీ సంఘంవారు చేయునది యిట్లున్నది.

ఇక అనుబంధ సొసైటీల చరిత్ర చూద్దాం. ముఖ్యంగా పశ్చిమ గోదావరి జిల్లా ఏలూరులో ఈ చేనేత క్రయ విక్రయ సంఘం మరీ అధ్వాన్నంగా వుంది. ఈ సంఘం యొక్క వైస్ ప్రెసిడెంటు, కోశాధికారి, ప్రెసిడెంటు వీరి నాయకత్వం క్రింద నడుచుచుండ వలయును.

రాష్ట్రీయ సంఘంవారు నెల 1కి 50 రూ॥ యీ సంఘానికి గ్రాంటు యిచ్చు చున్నారు. యీ కొట్టు మేనేజరుగారు 1000 మగ్గములు గల యీ ఏలూరులో వ్యాపారం వృద్ధి పరచుటకు అవకాశం లేదని 45 రూపాయలే ఖర్చు పెట్టి 5 రూపాయలు రాష్ట్రీ సంఘంవారికి మిగిల్చారు. దీనిపైన రాష్ట్రీ సంఘంవారు గమనించి 45 రూపాయలే గ్రాంటు చేశారు. యిది ప్రజల సంస్థ, చేనేత కష్టజీవుల అభివృద్ధి కోసం ఏర్పడినదన్న సంగతి మేనేజరు మరచి పోయినారు. యీ కొట్టును అభివృద్ధి పరచి సేల్ డిపోలు పెట్టి వ్యాపారం అభివృద్ధి పరచవలసింది పోయి, వారి సొంత వ్యాపారంలాగ సాధ్యమైనంత వరకు వ్యాపారం తగ్గించి చేనేత పారిశ్రామికులకు నష్టాన్ని చేకూరుస్తున్నారు. ఇక ప్రెసిడెంటుగారికి ఎవరూ ఎదురు చెప్పేవారులేరు.

ఒకవేళ ఎవరైనా ఎదురు చెప్పే వారున్నప్పటికీ చెప్పలేక వారికి తలలూచ వలసిందే. మొన్ననే యీ కొట్టుకు రివ్యూ ఎన్నికలు జరిగాయి. ఆ ఎన్నికలో మెంబర్లు ఎవ్వరినీ ఎన్నుకోలేదు. ప్రెసిడెంటుగారే వారిష్టం వచ్చిన వారిని నామినేటు చేయుచున్నారు. యిట్టి నాయకత్వముల వల్ల చేనేత పారిశ్రామికులకు కలిగే కొద్దిపాటి సౌఖ్యము కూడా నాశనము చేయుచున్నారు. కాన ఈ పరిస్థితులు రాష్ట్రీ సంఘం వారు గమనించ ప్రార్థన.

గుడిమెట్ల గంగరాజు,
ఏలూరు, 14—10—38.



### గుంటూరు జిల్లా కాంగ్రెస్ సోషలిస్టు పార్టీ కార్యనిర్వాహక వర్గ సమావేశము.

పై సమావేశము 7-12-38 వ తేదీని నరసరావుపేట పట్టణ కాంగ్రెస్ ఆఫీసులో మధ్యాహ్నం 2 గంటకు సమావేశమగును. చాలా ముఖ్యమైన విషయాలు చర్చించ వలసి వుంది గాన సభ్యులంతా తప్పక హాజరు కావలెను.

27—11—38 }
తెనాలి }
ఇట్లు,
పో. నరసింహామూర్తి.

★ ★ ★

### నెల్లూరు జిల్లా సోషలిస్టు పార్టీ

25—11—38 తేదీన మధ్యాహ్నం 11 గంటలకు నెల్లూరు జిల్లా కాం॥ సో॥ పార్టీ కార్య నిర్వాహక కమిటీ సమావేశము నూకలపాటి శంకరయ్యగారి అధ్యక్షతను సమావేశమై ఈ క్రింది తీర్మానములను అంగీకరించినవి.

1. జనవరి రెండవ వారములో నెల్లూరు జిల్లా కాం॥ సో॥ పార్టీ వార్షిక సమావేశము నెల్లూరులో జరుగునట్లు ఈ కమిటీ నిర్ణయించ మైనవి.

2. టర్కీ స్వాతంత్ర్యము కొరకు పోరాడిన టర్కీ రిపబ్లిక్ అధ్యక్షుడైన కెమాల్ పాషాగారి మరణమునకు యీ సభ తమ విచారమును తెలియజేయు చున్నది.

3. బొంబాయి రాష్ట్రీ కార్మిక చట్టము కార్మిక సంఘానికి అపకారం చేస్తుందని అట్టిది కాంగ్రెసు ఎన్నికల ప్రణాళికకు వ్యతిరేకముగా నున్నదని తలుస్తూ అలాంటి బిల్లును ప్రవేశపెట్టిన బొంబాయి కాంగ్రెసు మంత్రివర్గం వారి చర్యను ఖండిస్తూ ఆ బిల్లును ఆలిండియా ట్రేడు యూనియన్ కాంగ్రెసు వర్కింగు కమిటీ సూచనల ప్రకారం మార్పు చేయవలసినదిగా కోరుచున్నది.

యీ సందర్భంలో బొంబాయి యందు జరిగిన సమ్మెయందు లాఠీలను పోలీసు కాల్పులను నిరసిస్తూ సమ్మెను జయప్రదంగా సాగించిన కార్మికులను అభినందిస్తున్నది.

సమ్మె ముందున్నూ, తర్వాతయున్నూ కూలీల మీద అపోహలను అబద్ధములను ప్రచారము చేసిన పత్రికల యొక్కయు, వ్యక్తుల యొక్కయు, సంస్థల యొక్కయు చర్యను ఈ సభ ఖండిస్తున్నది.

4. కాశీపట్నం రైతుల విషయమై ఆంధ్ర రాష్ట్రీ రైతు సంఘమువారు, ఆలిండియా రైతు సంఘ కార్యదర్శి రంగాగారు విచారణ సలిపి సమగ్రమైన రిపోర్టు ప్రకటించి దేశము లోని అపోహలను తొలగించి నందులకు వారిని అభినందించుచూ, రైతులపై కేసులను ఉపసంహరించుకొని పైవారి రిపోర్టు ప్రకారము వారి న్యాయమైన హక్కులను వారికి కలుగజేయ వలసినదిగా మద్రాసు ప్రభుత్వమును ఈ సభ కోరుచున్నది.

5. ఆంధ్రదేశములోని వివిధ వంస్థలను గురించియు వార్తా లేఖలు అను శీర్షికతో వివిధ రాష్ట్రములకు పంపుచున్న వార్తాలేఖ ప్రెస్ అక్టు క్రిందికి వస్తుందని మద్రాసు ప్రభుత్వము వారు కృష్ణా జిల్లా కలక్టరు ద్వారా ఆంధ్ర కాం॥ సో॥ పార్టీ కార్యదర్శి శ్రీ పి. సుందరయ్యగారికి తెలియజేయడం, ఆం॥ కా॥ వ్యవసాయ కూలీ సంఘ కార్యదర్శి పెన్నెలకంటి రాఘవయ్యగారు ప్రకటించిన కరపత్రములు పత్రికా శాసనము క్రిందికి వస్తుందని తెలియజేయడం మొదలగునవి కాంగ్రెసు ఎన్నికల ప్రణాళికకు వ్యతిరేకముగా నున్నది గాన ప్రభుత్వ చర్యను తీవ్రముగా నిరసించుచూ యిటువంటి ఉత్తర్వులకు అవకాశమిచ్చేటి ప్రెస్ అక్టును వెంటనే రద్దుపరచ వలసినదిగా మద్రాసు మంత్రివర్గము వారిని కోరుచున్నాము.

బి. శంకరయ్య.
కార్యదర్శి,
26—11—38.

★ ★ ★

# అదీ —ఇదీ —అన్నీ

### ఆంధ్ర కాంగ్రెసు సోషలిస్టు పార్టీ కార్యదర్శిపై ఆంక్ష అక్రమము.

భీమవరం 22-11-38

అఖిలభారత కాంగ్రెసంఘ సభ్యుడును' ఆంధ్రరాష్ట్ర కాంగ్రెసు సోషలిస్టు పార్టీ ప్రధాన కార్యదర్శియు, అగు కామ్రేడ్ పి. సుందరయ్యగారిని, బెజవాడనుండి వార్తా లేఖలు పంపించ రాదని, కృష్ణాజిల్లా మేజస్ట్రేటు పుత్తరువు నిచ్చిరన్న వార్త చాల ఆశ్చర్యమును గొల్పుచున్నది. పేదరైతులు, కార్మికులు, స్త్రీలు, విద్యార్థులు, యువజనులు మొదలగు పీడిత జనాన్ని, యజమానుల దోపిడినుండి విరంకుశాధి కారులనుండి సంరక్షించే వుద్దేశం తోనూ, లంచగొండి తనాన్ని రూపుమాపాలనే దీక్షతోను సత్యము లయిన విషయాల్ని, లేఖల ద్వారాను, వార్తల ద్వారాను, ప్రపంచానికి ప్రభుత్వమునకు వెల్లడిస్తున్న సుందరయ్య గారి వ్రాతలను నిషేధించుటలో గల అంతరార్థమేమో తెలియకున్నది: ప్రజలపై జరుగుచున్న అన్యాయాలను అక్రమాలను బయటపెట్టు వ్రాతలను నిషేధించుటయనగా అక్రమాలకు అన్యాయాలకు దోహదమిచ్చుట తక్క వేరొండు కానేరదు. పైగా పౌరసత్వ హక్కులను కాపాడ వలసిన కాంగ్రెసు ప్రభుత్వ హయాములో ఇవి జరుగుచుండుట మరింత ఘోరము. యిది కాంగ్రెసు ఎన్నికల ప్రణాళికలో చేసిన వాగ్దానా పత్రికా స్వాతంత్ర సూత్రములకు విరుద్ధము. యీవిషయము జ్ఞప్తికి తెచ్చికొని, కాంగ్రెసు ప్రభుత్వము వెంటనే తగు రీతిని తనక్రింది పుద్యోగుల చర్యలను పరిశీలించి సవరించునని ఆశించుచున్నాము. కాంగ్రెసు, అధికారములో నున్నను వుద్యోగులు తమ పాత నిరంకుశ పద్ధతులకు మార్చుకొన లేదు. మార్చుకొనునట్లు చేయుట కాంగ్రెసు ప్రభుత్వ కనీస ధర్మము. లేనిచో కాంగ్రెసు పట్ల ప్రజల సదభిప్రాయము సన్నగిలుననుటకు సందియమేమియు లేదు. గాన కాంగ్రెసు పరువు ప్రతిష్ఠలను, పౌర స్వాతంత్రమును, సంరక్షింప గోరు ప్రతి కాంగ్రెసు వాదియు తగు ఆందోళన చేసి యిట్టివి మరల జరుగకుండు నట్లును, జరిగినవి దిద్దుకొను నట్లును చేయవలయును. ముఖ్యముగా యువజనులు, ముందడుగు వేయుదురని ఆశించెదను. యీ ఆంక్ష పత్రికా స్వాతంత్రమున కడ్డు తగులుచున్నది గాన పత్రికాధిపతులు, ఆంధ్రదేశ ప్రోగ్రెసివ్ రైతులు మహాసభవారు, ప్రతీక శక్తి నైకొని ఆందోళన చేయ ప్రార్థితులు.

ఇట్లు
ఆల్లూరి సత్యనారాయణ,
కార్యదర్శి, ఆంధ్రరాష్ట్రీ యువజన సంఘం.

★ ★ ★

### బహిరంగ సభలు.

20-11-38 తిరువూరు తాలూకా తునికిపాడు, 21-11-38 నందిగామ తాలూకా మలుగుమాడు, 22-11-38 నందిగామ తాలూకా అన్నవరం గ్రామాలలో కాంగ్రెసు బహిరంగ సభలు జరిగినవి, పై సభలకు నైజాము ప్రజలు చాలా మంది వచ్చారు. సమావేశ స్వతంత్ర్యములేని నైజాము ప్రజలకు బ్రిటిషు సరిహద్దుల మీద సభలు ఏర్పాటు చేయబడినవి. సంస్థాన ప్రజల ఉత్సాహము రోజు రోజుకు ఇనుమడించు చున్నది. ప్రజల ఉత్సాహాన్ని అణచుటకు ఏ నిరంకుశ చర్యలు అష్టు పరచలేవని విశద పడినది. ఆంధ్ర రాష్ట్రీ కాంగ్రెసు సోషలిస్టు పార్టీ సంయుక్త కార్యదర్శి బొర్నెలగడ్డ రామలింగయ్యగారు, పొట్లూరి సుందరంగారు, వానిరెడ్డి నారాయణరావుగారు సభలలో ఉపన్యసించిరి. 24 వ తేదీ మధిర తాలూకాలో జరుగబోవు సత్యాగ్రహాన్ని బలపరచి విజయమును పొందవలెననియు ఉపన్యసించిరి. ఈ క్రింది తీర్మానములు సభలలో ఆమోదింప బడెను.

1. బాధ్యతాయుత స్వపరిపాలన కొరకు న్యాయ సమ్మతమును, శాంతియుతమునగు సత్యాగ్రహ సమరమును సాగించుచున్న సంస్థాన ప్రజలకి సభవారు సానుభూతిని తెలియ బరచుచున్నారు.

పత్రికా స్వాతంత్ర్యము, వాక్స్వాతంత్ర్యము సమావేశ స్వాతంత్ర్యము అరికట్టుచు నిరంకుశముగ, నిర్బంధ చర్యలు కొనసాగించుచున్న నైజాం ప్రభుత్వ చర్యలను ఈ సభవారు నిరసించు చున్నారు.

2. సామ్రాజ్యవాద యుద్ధాలు, పెట్టుబడిదారులకు, జమీందారులకు లాభదాయకములు. రైతులు కూలీలు దోచబడతారు. ప్రాణాలను కోల్పోతారు. నష్టాలకు లోనవుతారు. కాన ఈ సభవారు ధన సహాయము చేయకుండుటకు యుద్ధములో చేరకుండ యుండవలసినదిగా తీర్మానించ కోరుచున్నారు.

3. మన నెత్తిమీద రుద్ద జూచుచున్న ఫెడరేషను ఇదివరకున్న పౌరసత్వపు హక్కులను కూడ మ్రింగివేయు చున్నది. కాన యీ పెనుభూతమును యెదుర్కొని ధ్వంసము చేయవలసినదిగా ఈ సభవారు తీర్మానించు చున్నారు.

తునికిపాడు }
23-11-38. }
ఇట్లు,
సుంకర వీరభద్రరావు.

★ ★ ★

### ఆంధ్రరాష్ట్రీ ఏజన్సీ ప్రజల సంఘము.

20 డిశంబరు '38 తేదీలోగా సంఘ సభ్యులుగా చేరినవారు మాత్రమే, రానున్న ఎన్నికలలో పాల్గొన సమ్మలు. నూతన కార్యనిర్వాహక వర్గము ఎన్నికలు డిశంబరు ఆఖరు వారములో జరుగును. కావున 18 సంవత్సరాలు దాటిన ఏజెన్సీ ప్రజలు, వారి శ్రేయోభిలాషులు నిర్ణీతకాలము లోగా సంఘ సభ్యులుగాచేరి, సభ్యత్వ పత్రికలు, రసీదు పుస్తకాలకు సంఘ కార్యాలయము మునకు దరఖాస్తులు పెట్టుకొనవలెను. సభ్యత్వ పత్రికా పుస్తకములు తదితర సంఘ కార్యాలయము మునకు వ్రాసిన పంపబడును.

కా॥ పట్టాభిరామయ్య,
ప్రధాన కార్యదర్శి.

★ ★ ★

### కృష్ణాజిల్లా వ్యైశాంగ విద్యాలయం.

23-11-38 తేదీ సాయంత్రం 2 గంటల నుండి 5½ గంటల వరకు శ్రీ బెజ్వాడగవర్నమెంట్ శర్మగారు 1802 పెర్మనెంటు సెటిల్మెంటును గురించియు, దానివల్ల రైతులకు కల్గిన నష్టమును గురించి ఉపన్యసించుచూ పెర్మనెంటు సెటిల్మెంటు రద్దు కావలసిన వివిధ కారణములను గురించియు విపులముగా వివరించిరి. తరువాత జమీందారీ సిద్ధాంతం పూర్తిగా తొలగిపోతేనేగాని రైతులు అభివృద్ధి పొందుటకు అవకాశముండదనెడి విషయమును గురించి కూడా ఉపన్యసించిరి.

వైశాంగ విద్యాలయమునకు అందు మద్రాసు వ్యవసాయ శాఖ డిపార్టుమెంటు వారిచే ఎగ్జిబిషను 23 వ తేదీన తెరువబడినది. యీనెల 30 వ తేదీవరకు వుండబడును.

గుంటూరు డిమాన్‌స్ట్రేటరు మద్దిపల్లి నరసింహారావుగారు 24 వ తేదీ హృదయం విద్యార్థులకు వ్యవసాయ శాఖవారు చేయుచున్న పని రైతుల కర్తవ్యమును గురించిన్నీ, డిమాన్‌స్ట్రేటరు సాంబశివరావుగారు వృక్ష శాస్త్రమును గురించిన్నీ బోధించిరి.

బెజవాడ తాలూకా డిమాన్‌స్ట్రేటరు దాసరి బాపయ్యగారు సాయంత్రం 2 గంటల నుండి 5 గంటలవరకు వ్యవసాయ శాస్త్రమునకు యితర శాస్త్రములకును ఎట్టి సంబంధమున్నదో తెలుపుచూ అన్ని శాస్త్రముల సమన్వయమే వ్యవసాయ శాస్త్రమని నిరూపించుచూ విపులముగా ఉపన్యసించిరి.

# పాటలు — పద్యాలు

## నిశా మంత్రిత్వం

శ్రీరంగం నారాయణబాబు గారు

వాయులీనం
వాయుషుగాలు
వాయించిన
కళ్యాణీరాగం!
శ్యామల నిశాగమనం!

వాసనలేగసు
ఆకాశమ్మున
అగరువత్తులై
వెలిగినవి
వేనవేలు చుక్కలు
.......................

స్పందించినది
కాలం హృదయం
కంచుగంట
ఒంటిగంట
పిశాచాయుత
వినినవిటని
ఛాయల
తొంగిచూచె
ఐరావతపు సంధి
అర్ధచంద్రుడు

ఆకలిచే
అనురాగంతో
నాదేశం పొడుగున
తల్లిలేని పిల్లలు
తల్లడిల్లి, మేల్కాని
గొల్లని ఏడ్వగ
ఆ స్వర్గ ద్వారమ్ముల
పెకలింపకా,
వైతరికెను
మమతవిడని
మాతృ శ్రీ
స్తన్యధార
త్రాగేందుకు
దొరకని వెన్నెల
.................

అందవు నా
చందమామ!
మనలో మనమాట
మరచితివా!
సంధ్యా రక్తస్రావం!
చీకటి లాఠీదెబ్బల
చిక్కి నగంబైనావా!
స్వప్నమైన నీమోము
మచ్చపడెను!
నిశయంతె

అసుర బలం!
నీవెట్టుల
రాజ్ఞివి!
మన్ననలందె
మంత్రివి!
అంతే
నెలవిమ్మా
కలదేమో
స్వజాతీయ
సభావేవి
దాయకై
ముక్తి!
సామ్యవాద
సంస్కరణ
శక్తి!

— "మధిరజ్యోతి" నుండి.

## ఆక్రోశము !!

యస్. యమ్. అక్బర్ గారు

ఇంకో రాజ్యం, ఇంకో రాజ్యం,
ఇంకో రాజ్యం కావాలి!
కూలిన రైతూ, కృంగిన కూలీ,
యేలే రాజ్యం కావాలి!
జీవం రక్తం, కష్టం ఫలితం,
యిచ్చే రాజ్యం కావాలి!
ప్రాణం మానం, పాపల అన్నం
యూడ్చే రాజ్యం పోవాలి!!

మూల్గుల లోపల మూల్గుచు నుండి
పతితస్థలిలో ఒత్తుకపోయి
నెత్తురు లోపల పొత్తుకయుండి
ఉష్ణరక్తము నూర్చివేయుచూ
జీవన్మృతునిగ, జీర్ణమృగముగా
కృంగదీసిన కటికదాస్యమూ—
దాసుల రాజ్యం—దోచే రాజ్యం—పోవాలి!
కష్ట కార్మికులు ఏలే రాజ్యం కావాలి!!

మన్నులో మన్నై, మంటలో మంటై
రెక్కలు వంచి, రక్తము రాల్చిన!
కంటికి మంటికి కన్నీరిచ్చి
దమ్మిడి చూపని దరిద్రరాజ్యం!
ఒంటికి ఇంటికి మన్నీరిచ్చి
సోమరులందరి పక్కగయుంచే—
పక్కనరాజ్యాల, రాలేరాజ్యం పోవాలి!
కష్టజీవుల ఏలే రాజ్యం కావాలి!!

—

# కార్మిక సమస్యలు

(9 వ పేజీ తరువాయి)

## కలకత్తా

ఆదివారాలు తమకు శెలవు కావాలని ఇతర వృత్తులలో పనిచేసే కార్మికులు ఆందోళన చేస్తున్నారు. ఆదివారాల్లో వారు పని చేయాలని యజమానులు బలవంత పెట్టారు. 400 మంది నిరాకరించి, సమ్మె చేశారు. యజమానులు పనిలోనుండి వారిని తొలగించారు. తగాదాను పరిష్కారం చేయడానికి ప్రయత్నాలు సాగుతున్నాయి.

ఎలక్ట్రిక్ ట్రామ్వే వర్కర్సు.

కలకత్తా ట్రామ్వే కార్మికులు తమ కష్టాల శ్రీ సుభాస్ చంద్రబోసుగారికి తెలియజేశారు. బోసుగారు వాటిని వెంటనే నెరవేర్చుటకు యజమానులు పూనుకోవాలని హెచ్చరించారు.

పెల్లాక్ ఫ్యాక్టరీ సమ్మె.

పెల్లాక్ ఫ్యాక్టరీలో కార్మికుల సమ్మె యింకా సాగుతూనే ఉన్నది. 144 వ సెక్షన్ ప్రయోగింప బడింది. నవంబరు 20 వ తేదీని సమ్మెదారులకు దానిని భగ్నం చేయాలనే కార్మికులకు మధ్య పోరాటం జరిగింది. 8 మంది గాయపడ్డారు. 2 అరెస్టు చేయబడ్డారు.

## బెంగాల్

దో ఆర్సు రైల్వే.

ఈ రైల్వేలో పనిచేస్తూన్న కార్మికులకు ఇదివరలో ప్రతి సంవత్సరం ఇచ్చే రెండు నెలల శెలవును 1½ నెలలకు తగ్గించారు. పనివాళ్ళను 1917 స్థితికి, సంఖ్యను తగ్గింపారు. జీతాలను కూడా తగ్గించారు.

ఇందు పనిచేసేవారు మలేరియా ప్రాంతాలలో ఎక్కువ పని చేయవలయును. వీరి ఆరోగ్యము బాగుగా నుండుటకై శలవులు ఎక్కువచేసి పనిచేసే స్టాఫ్‌ను ఎక్కువ చేయడానికి బదులు స్టాఫ్‌ను, వారి జీతాలను శలవులనూ కూడా యజమానులు తగ్గించారు.

జూట్ సమ్మె.

బెంగాలు జూట్ కార్మికుల కేంద్ర సంఘం సమావేశమై బెంగాల్ కార్మికులకి దిగువ హెచ్చరిక నిచ్చింది.

"బెంగాల్ జూట్ ఆర్డినెన్సు కార్మికుల హక్కులను పూర్తిగా రద్దుచేసి వారి కూటిని పడగొట్టింది. ఆ శాసనానికి వ్యతిరేకంగా సమ్మె చేయవలసినదని కేంద్ర సంఘము తీర్మానించిన వెంటనే సమ్మెను ప్రారంభించుటకు తయారుగా అందరూ ఉండవలసినది." అందుకై యిదివరలో అనేక సభలు జరిగాయి. వివిధ ప్రాంతాల కార్మికుల ప్రతినిధులతో చర్చించి తేదీని నిర్ణయించుటకు సభలు ఏర్పాటు చేయబడుతున్నాయి. యీ సమ్మెలో 2 లక్షలు తక్కువకాకుండా కార్మికులు పాల్గొననున్నారు.

## దాల్మియానగరం

యిప్పటనున్న అన్ని పరిశ్రమలలోని కార్మికులూ సమ్మెలో చేరారు. పేపరు మిల్లు యజమానులు మిల్లు మూసివేశారు. కాని, 25 వ తేదీని ఆ దిగువ షరతులకు యజమాను లంగీకరించుటచే సమ్మె ఆపివేయబడింది.

1. నెల 13 11 రూపాయిలు జీతం, ప్రతి ఆదివారం ఒక పూట శలవు.

2. 11 నుండి 30 రూపాయిలకు మధ్య జీతం పుచ్చేవాళ్ళకు నూటికి 15 వంతున హెచ్చించుట. 30 నుండి 50 రూపాయిల మధ్య జీతం వచ్చేవాళ్ళకు నూటికి 10 వంతున హెచ్చించుట.

3. ట్రేడ్ యూనియన్ కార్యక్రమంలో పాల్గొనుటకు ఏ ఆటంకము పెట్టమని యజమానులు అంగీకరించారు.

## కాన్పూరు

నిరుద్యోగుల నిశ్చయం.

సంయుక్త పరగణాల గవర్నరు కాన్పూరు వచ్చే సందర్భంలో నిరుద్యోగులగు కార్మికులు తమ కష్టాన్ని తీర్చవలసినదని ప్రదర్శనము చేయుటకు తీర్మానించారు. వీరు మజ్దూర్ మహాసభ ఆజ్ఞానువర్తులు. వీరుకాక మరికొందరు కాన్పూరు కలక్టరు ద్వారా గవర్నరుకు ఒక పిటిషన్ పంపారు. అందు కార్మిక సంఘాన్ని నిందిస్తూ రాత్రులందు పనిచేయని ఫ్యాక్టరీలలో రాత్రిపని ప్రారంభించేటట్లు చేయవలసినదనియు పల్లెటూళ్ళ నుండి పట్టణానికి వలవచ్చుచున్న నిరాధారులను అపు చేయవలసిన దనియు కోరుతూ దరఖాస్తులు చేశారు.

కాన్పూరు కార్మికులు తమ ఐక్యత ద్వారా ఎన్నో హక్కులు పొందారు. వారి ఐక్యతను చీలగొట్టుటకు యిట్టి ప్రయత్నాలు సాగుతున్నాయి. కార్మికులు వీటికి మోసపోరాదు.

## డాల్టన్‌గంజ్

సిమెంటు కార్మికుల సమ్మె.

ఇక్కడనున్న సిమెంటు పరిశ్రమలో పని చేసే 300 మంది తమ జీతాలు ఎక్కువ చేయవలసిందని నవంబరు 11 వ తేదీ నుండి సమ్మె సాగిస్తున్నారు. పోర్టు లాండ్ సిమెంటు కంపెనీలో పనిచేసే కార్మికులు కూడా పై హక్కులకై 4 రోజులలో సమ్మె ప్రారంభింప నున్నామని కంపెనీ యజమానులకు నోటీసిచ్చారు.

## కొచ్చిన్

సమ్మె.

కొబ్బరితాడు ఫ్యాక్టరీలలో పనిచేసేవారు 1000 మంది 17 వ తేదీ నుండి సమ్మె ప్రారంభించారు. కొచ్చిన్‌లోని ఫ్యాక్టరీలన్నీ మూతబడిపోయాయి. యీ కార్మికులకు రోజు 15 0—5—9 కంటె ఎక్కువ ఎవరికీ గిట్టుటలేదు. కాని కంట్రాక్టరులకు మనిషికి 6—12—0 చొప్పున రోజు 15 దొరకుచున్నది. ఈ కంట్రాక్టు పద్ధతిని తొలగించ వలసినదని ఇదివరకెన్నియో పర్యాయములు కార్మికులు యజమానులను కోరారు. యజమానులు ఏమీ లెక్కచేయలేదు. యజమానులతో సంప్రదింపులకు కొందరిని కార్మిక సంఘం నియమించింది. వీరి ప్రయత్నాలు కూడా వ్యర్థ మవడం చేత ఈ కార్మికులు సమ్మెను ప్రారంభించారు. ఎర్రటి డ్రస్సులు వేసుకొన్న వాలంటీర్లు, కార్మికుల నినాదాలతో పెద్ద ఊరేగింపును సాగించి 17 వ తేదీ సాయంత్రం పి. కేశవదేవ్‌గారి అధ్యక్షతను సభ జరిపారు. సభలో వివరాలన్నీ విశదీకరిస్తూ పలువురు ఉపన్యసించారు.



# హైద్రాబాద్ సత్యాగ్రహ దినం జయప్రదంగా జరిగింది.

స్టేట్సు ప్రొటెక్షన్ ఆక్టు 23 వ నవంబరు నుంచి అమలు జరుపబడింది.

నవంబరు 21 వ తేదీని హైదరాబాదు స్టేటుకాంగ్రెసు 9 వ డిక్టేటరు శ్రీయుత గోపాలరావుగారు మరి 4 గురు అరెస్టు చేయబడ్డారు. "సంస్థానమం దన్నిచోట్ల సత్యాగ్రహం ప్రారంభింప నున్నాము," అని ఆయన ప్రకటించారు. 20 వ తేదీని ఔరంగాబాదులో మానెక్‌చంద్ పాకీడుగారు మరి నలుగురున్ను అరెస్టు చేయబడ్డారు. నవంబరు 23 వ తేదీని హైదరాబాదు సంస్థానములోని బ్రిటిషు పాలిత ప్రదేశాలన్నిటియందును స్టేట్సు ప్రొటెక్షన్ ఆక్టు ప్రయోగింపబడింది. సికింద్రాబాదు పట్నం, ఔరంగాబాదు కంటోన్మెంటులలోనూ, సంస్థానమందలి రైల్వేలలోనూ ఈ చట్టము ప్రస్తుతం అమలులో నున్నది.

విజయవంతమైన హైదరాబాదు సత్యాగ్రహ దినం

నవంబరు 24 వ తేదీ ఈద్ పండుగ అవడంచేత హైదరాబాదు సత్యాగ్రహ దినోత్సవం 23 వ తేదీనే సంస్థానమం దన్ని ప్రాంతము లందును జరిగినది. 70 మంది అరెస్టు అయారు. ప్రజలు వేలకు వేలుగా సత్యాగ్రహ సమయములందు హాజరయి స్టేట్ కాంగ్రెసుకి జై అని నినాదాలను గావించారు. పోలీసులు లాఠీచార్జీలు చేశారు. ఈ దినోత్సవ సందర్భములో విద్యార్థులు మహమ్మదీయులు, స్త్రీలు కూడా పాల్గొనుచు ముందుకు వచ్చుచున్నారు.

హైదరాబాదులో సత్యాగ్రహ దినోత్సవ సందర్భంలో ముగ్గురు సత్యాగ్రహులు ప్రభాత ఫేరీని సాగించారు. వెంటనే వేలకొలది ప్రజలు ఊరేగింపులో కలిశారు. "స్టేట్ కాంగ్రెసు వర్ధిల్లాలి" అనే నినాదాలు మిన్నంటాయి, పోలీసులు సత్యాగ్రహులను అరెస్టు చేశారు. ఖద్దరు ధరించిన ఒక కొత్తాయనను కూడా ప్రజా సామాన్యములోనుండి పోలీసులు అరెస్టు చేశారు. ఆ క్రితం రాత్రి సత్యాగ్రహ దినోత్సవాన్ని గురించి కరపత్రాలు పంచి, పోస్టర్లు అంటించుచుండగా పోలీసులు కొందరు సత్యాగ్రహులను అరెస్టు చేశారు. 23 తేదీని 10 యవ నియంత అయిన శ్రీ దిగంబరరావు బిందూగారు, ఆయనచే నియమింపబడిన కార్యదర్శులు 4 గురు అరెస్టు చేయబడ్డారు. కాచిగూడ రైల్వే స్టేషన్ మైదానంవద్ద సభను ఏర్పాటు చేశారు. సుమారు 15 వేలమంది సభకు హాజరయ్యారు. రైల్వే బ్రిటిషువారి పాలనలో ఉండడంవల్ల అచ్చట సభ జరుగుటకు వీలులేదని రైల్వే పోలీసు ఆటంకపరచాడు. ఆ చోటినుండి యింకొక చోటికి ప్రజలనందరిని తీసుకొని పోవుచుండగా నైజాము సంస్థాన పోలీసులు వారిని అరెస్టు చేశారు. ప్రజలలో మామూలు డ్రస్సులతో తిరుగుతూన్న వెంకోబారావు అను సి. ఐ. డి. పోలీసునుకూడా వీరితోపాటు అరెస్టు చేశారు. ఆయన తన కార్డును చూపిన మీదట విడుదల చేయబడ్డాడు. స్టేట్ కాంగ్రెసుయొక్క తీర్మానం ప్రజలలో పంచిపెట్టబడింది.

స్టేట్ కాంగ్రెసు దినోత్సవ సందర్భంలో నిజామాబాదులో 3 గురు సత్యాగ్రహులు 2 సభలు జరిపారు. లాఠీ చార్జి జరిగింది. చాలామంది గాయపడ్డారు. సత్యాగ్రహులు అరెస్టు చేయబడ్డారు. భువనగిరిలో 6 గురు, వరంగల్‌లో 3 గురు సత్యాగ్రహం చేసి అరెస్టు చేయబడ్డారు. తండూరులోకూడా ఈ దినోత్సవం జరిగింది. అన్ని ప్రాంతాలలోనూ సభలకు వేలమీద ప్రజలు హాజరయారు.

జాదేవల్లిలో జరిగిన సత్యాగ్రహము హైదరాబాదు ప్రజా పోరాటంలో ముఖ్యమైనది. ఇందు విద్యార్థులు స్త్రీలు, మహమ్మదీయులుకూడా పాల్గొన్నారు. కానివారిని పోలీసులు అరెస్టు చేయలేదు—జాదేవల్లిలో 3 గురు మాత్రమే అరెస్టు చేయబడ్డారు. 24 వ తేదీని ప్రభాకర గుప్తా అను ఒకరిని కాంగ్రెసు అభిమాని అని తలచి ఎవరో కొట్టి గాయపరచారు, తలనిండా గాయాలయాయి. ఉస్మానియా జనరల్ హాస్పిటల్‌లో అతనికి కట్లు కట్టి చికిత్స చేస్తున్నారు.

హైదరాబాదు స్టేట్ కాంగ్రెసు ఆక్టింగు ప్రెసిడెంటు అయిన దామోదరదాస్‌గారు "సత్యాగ్రహాన్ని జయప్రదంగా స్వయంగా సాగించండి. హిందూ సివిల్ లిబర్టీస్ యూనియన్, ఆర్యన్ లీగుల తరఫున సత్యాగ్రహమును సాగించవలదని ఆయా సంస్థలను ప్రజలను కోరుతున్నాను" అని వార్ధానుండి ఒక ప్రకటన చేశారు.

25 వ తేదీని ఔరంగాబాదులో జి. యం. శేత అను పత్రికలఏజంటు పోస్టర్లలోని విశేషాలను అరుస్తు వీధుల వెంట పత్రిక లమ్ముతోంటే పోలీసులు అరెస్టు చేశారు. ఔరంగాబాదు జిల్లాలో దినోత్సవ సందర్భములో మొత్తం 33 గ్గురు అరెస్టు చేయబడ్డారు.

హైదరాబాదు సత్యాగ్రహ దినోత్సవ సందర్భంలో స్టేట్‌కాంగ్రెసుకు సానుభూతిని వెలిబుచ్చుచు సరిహద్దులలో నున్న బ్రిటిషు యిండియా గ్రామాలలో సభలు జరిగాయి. కాగ్రమేడ్పు జొన్నలగడ్డ రామలింగయ్య, పొట్లూరి సుందరం, వాసిరెడ్డి నారాయణరావు గార్లు సభలలో ఉపన్యసించారు.

అఖిల భారత సంస్థానాధీశుల మహాసభ నవంబరు 28 వ తేదీని బొంబాయిలో జరుగును. సంస్థానాధీశుల అధికారాలలో చేయబడిన మార్పులను గురించియు, ఫెడరేషన్ గురించియు వివిధ సంస్థానాలలో జరుగుతూన్న ప్రజా ఉద్యమాన్ని ఎదుర్కొనుటను గురించియు చర్చించుటకు యీ సభ జరుగుచున్నది.

## రాజకోట

అఖిల భారత సంస్థాన ప్రజల మహాసభ కార్యదర్శి అయిన బల్వంతరాయి మెహతాగారు ఒక దళముతో రాజకోటలో సత్యాగ్రహం చేశారు. మెహతాగారిని మాత్రము అరెస్టు చేసి మిగిలినవారిని విడుదల చేశారు. గుజరాతు కాంగ్రెసు సోషలిస్టు పార్టీ సమావేశమై రాజకోట సత్యాగ్రహానికి ఒక దళమును పంపుటకు తీర్మానించింది. గుజరాతు రాష్ట్రీ కాంగ్రెసు కమిటీ వల్లభాయిగారి అధ్యక్షతను సమావేశమై రాజకోట సంస్థాన ప్రజల సత్యాగ్రహానికి సానుభూతిని, సహకారమును తెలియజేయుచు తీర్మానించింది.

"జాక్టోరీని ఆచర్మప్రాయముగా చేశాను. ఇప్పుడిక రాజకోటను చేయనున్నాను. సంస్థానాధీశులు సాగించే దుష్పరిపాలనను కప్పిపుచ్చేటందుకు కాదు కాంగ్రెసు తీర్మానం ఉపయోగించేది. దానిని రద్దుచేసేంతవకే. సంస్థానాలలోని భారతీయులను, ఇతర భారతీయులను విడదీయ గాదు. వారంతా ఒకటే. నేనే రాజకోట పోరాటాన్ని నడిపిస్తున్నాను. గుజరాతులోని యితర సంస్థానాధీశులు తమ వైఖరిని మార్చుకోకపోతే జాగ్రత్త. వాటన్నిటిలోనూ రాజకోటమే మూర్తీభవిస్తుంది.

"సంస్థాన ప్రజలకు పరిపాలనచేత కాదని ప్రభువులంటున్నారు. ప్రభువులకు మాత్రం ఏమి చేతనవును. వారు నేర్చుకొనిన విద్యలు వారిని పశువులను చేశాయి. మానవులను చేయలేదు. సంస్థానాలలో సాగుతూన్న ప్రజా పోరాటాన్ని చూచి జడిసి ప్రభువులందరు పై ప్రభువు (బ్రిటిషు ప్రభుత్వం) వద్దకు పోయి మొర బెట్టుకొంటున్నారు. సంస్థానాధీశులకు వారి ప్రజలే పై ప్రభువులు: బ్రిటిషు ప్రభుత్వం కాదు. ప్రజలు తలచుకొంటే ఎమైనా జరుగుతుంది. ప్రజల ఏ నేరమును చేయకుండా బ్రిటిషు ప్రభుత్వం ఏమీ చేయలేదు. రాజకోట సంస్థాన ప్రజలకు, ధనానికి, మనుష్యులకి, ఇతర సహాయ సంపత్తికి కరువేమీలేదు. సాగించండి పోరాటం. బాధ్యతాయుత ప్రభుత్వం వచ్చే వరకూ సాగవలసినదే: నేను పరాయివాడినని సంస్థాన ప్రభుత్వము అంటోంది. పరాయివాడిని నేను కాదు. సముద్రాలుదాటి ఇక్కడకి దిగుమతి అయినవారే పరాయివాళ్లు. నా అనుమతి లేనిదే ఏ సంస్కరణకి అంగీకరించకండి. పోరాటం సాగించండి" అని రాజకోట ప్రజలను మిగిలిన సంస్థాన ప్రజలను వల్లభాయి పటేలుగారు హెచ్చరించారు.

22 వ తేదీని 15 మంది అరెస్టు చేయబడ్డారు. నవంబరు 9 వ తేదీ నుండి 22 వరకూ జరిగిన సత్యాగ్రహములో లాఠీ చార్జీలవల్ల 300 పైగా గాయపడ్డారు. ఇందులో చాలామంది స్త్రీలు, బాలురుకూడా ఉన్నారు. 23 వ తేదీని 40 మంది అరెస్టు చేయబడ్డారు. ప్రజా పరిషత్తు సేవకులచే వాడబడుతున్నాయని 3 సైకిళ్ళను ఒక మోటారు కారును పోలీసులు వశం చేసుకొన్నారు. సత్యాగ్రహులను అరెస్టుచేసి దూరముగా తీసుకొనివెళ్ళి కొందరిని విడుదలచేయుట, కొట్టుటలు ప్రారంభమయాయి. రాజకోటలో జరుగుచున్న హింసా కాండను విచారించడానికి 4 లాయర్లు సంచారం చేస్తున్నారు. వారు పోయినచోటల్లా "తీవ్రమయిన లాఠీ చార్జీలు జరిగాయి" అని ప్రజలు మొరపెట్టు తున్నారు. "ప్రజా పరిషత్తు సేవకులకు మంచినీళ్లు ఇచ్చారన్న కారణంచేత తన కుటుంబములోని 7 గురిని ప్రభుత్వము శిక్షించింద"ని ఒక ముసలి ఆమె ఈ లాయర్లతో చెప్పింది. జైళ్లలో సత్యాగ్రహులను కొట్టడము, మొదలగు హింసలు జరుగుతున్నాయి. "మాహుదీ" జైలులో 9 గురు హంగురు స్ట్రయికు చేస్తున్నారు. 21 వ తేదీని అరెస్టు చేయబడ్డ 3 గ్గురికి

తిండి పెట్టనేలేదు. అందుచే వారూ నిరశన వ్రతం ప్రారంభించారు.

రాజకోట సత్యాగ్రహంలో పాల్గొనడానికి గుజరాతు రాష్ట్రీయము అన్ని మూలలనుండి సత్యాగ్రహులు వెళ్లుతున్నారు. హాల్లేన్డానుండి సార్ధాకు 2 రోజులు రైతు యాత్ర ఏర్పాటు చేయబడింది. ఇందు చాలమంది స్త్రీలు, పురుషులు, బాలురు అందరూ పాల్గొంటున్నారు. గ్రామాలలోనుంచి ప్రజా మండలి సేవకులను అరెస్టు చేసి మోటారుగా తీసుకొనివెళ్ళి వదలివేయుచున్నారు. 25 తేదీని 20 మందిని ఇల్లా పట్టుకొని వదలివెళ్లారు. ఒక స్లీపరుగారిని 13 వలంటీర్లను అరెస్టు చేశారు.

## మీవార్

ప్రజా మండలి సత్యాగ్రహం ప్రారంభించింది. 4గురు అరెస్టు జరిగింది. అందులో ముగ్గురు స్త్రీలు ఉన్నారు. లాఠీచార్జీ జరిగింది. 1 గాయపడ్డారు. చాలా మంది ప్రజలు సభకు హాజరయారు.

## ఢేంకానల్

"సంస్థానంలో నిర్బంధ సేవను రద్దు చేస్తాను' సాలీనా 80 వేల రూపాయలు కన్సెషన్ ప్రజలకు ఇస్తాను"అని సంస్థాన ప్రభువు కొందరు ప్రజామండలి నాయకులతో చెప్పాడు. "ఇవి చాలవు. ప్రభుత్వ పరిపాలన ప్రజా ప్రతినిధుల సలహా ప్రకారం సాగుతుందనే సూచన కేసీ ఈ ప్రకటనలో లేవు. ఇంత వరకు 7 పర్యాయములుగా జరిగిన కాల్పులను గూర్చి విచారణ జరగాలి"అని ప్రజామండలి నాయకులు నిరాకరించారు. అరెస్టులు యథాప్రకారంగానే జరుగుతున్నాయి.

## బెల్పార్

బెల్పార్ సంస్థానములో సాగుచున్న ప్రజాందోళన వలన చాలమంది ప్రజల పంటలను సంస్థాన ప్రభుత్వము జప్తు చేసినది. ఇట్లు బాధింపబడిన రైతులు 8000 మంది "అన్గులు" పట్టణానికి చేరుకొన్నారు. సంస్థాన ప్రభుత్వపు ఈ వైఖరిపట్ల ఒరిస్సా గవర్నమెంటు చాలాఆందోళన పడుచున్నట్లు తెలియుచున్నది.

## తిరువాన్కూరు

తిరువాన్కూరు స్టేటు కాంగ్రెసు నాయకులు మహాత్మునితో సంప్రదించారు. "దివాన్‌పై ఆరోపణలను ఉపసంహరించుకొంటారా?" అని గాంధీగారడిగారు. "అవి అబద్ధమైనవి కావు. అవి ఉపసంహరించుకొంటే స్టేట్ కాంగ్రెస్ ప్రతిష్ఠయే పోతుంది. వాటి విషయమై విచారణ జరుగనిదే ఈ దివాన్ పోవటము జరుగదు" అని తిరువాన్కూరువారు సమాధానమిచ్చారు. "అయినా గాని ఈ విషయాన్ని గురించి ఎక్కువమంది ప్రతినిధులతో మాట్లాడి నిర్ణయించాలి. మామీదే యీ బాధ్యత అంతా వదలితే వాటిని ఉపసంహరించుకొని ఇంకా మాకు చేతనైన విధాన్ని పోరాటాన్ని సాగిస్తాము" అను అభిప్రాయాన్ని స్టేట్ కాంగ్రెసు నాయకులు వెల్లడించారు. అందరూ తిరువాన్కూరు తిరిగి పోయారు.

ఆనీ మాస్కరీన్ గారిపై రాజద్రోహ నేరపు కేసు జరుగుతోంది.

తిరువాన్కూరు సంస్థానమునందలి కోర్టులలో వకీలుగా పనిచేసే హక్కు తనకున్నదని వాదిస్తూ కె. టి. థామస్ గారు హైకోర్టులో పిటీషను పెట్టారు. దానిని హైకోర్టు నిరాకరించింది. క్రిమినల్ లా అక్టు క్రింద శిక్షింపబడినందున వీరి కీహక్కు రెండేళ్ళవరకూ లేదని నిర్ణయించబడింది.

తనతో తిరువాన్కూరు నాయకులు మాట్లాడిన విషయాలన్నీ వేరనియు, పత్రికలలో ప్రకటింపబడినవి సరికాదనియు మహాత్మా గాంధీగారు ప్రకటన చేశారు.

## మైసూరు

విదురాశ్వత్థం విచారణ కమిటీయొక్క నివేదిక చాలా అక్రమమైన తీర్పు చెప్పిందని దేశములోని పత్రికలన్నీ గగ్గోలు చేస్తున్నాయి. సంస్థాన ప్రభుత్వము అంగీకరించింది. స్టేట్ కాంగ్రెసు "రామేశం కమిటీ నివేదిక సత్యానికి, న్యాయానికి, విరుద్ధము అయినది. సంస్థానములోని ప్రజా ఉద్యమానికి వ్యతిరేకముగా తీర్పుచెప్పేటట్టి గవర్నమెంటుయొక్క యంత్రమువలెనే పని చేసింది. వృథా ఖర్చు మాత్రము పెట్టింది. కాంగ్రెసుచే సాగింపబడ్డ సత్రమాందోళన అక్రమమన్నది. రాజకీయ సమస్యలను ఎత్తుకోనని బాధ్యతాయుత ప్రభుత్వము సంగతి వదలి క్రిమినల్ లా అమెండుమెంటు ఆక్టును సమర్థించింది" అని నివేదికను ఖండించింది. నవంబరు 26 వ తేదీని "విదురాశ్వత్థ దినం" మైసూరంతటా జరిపి రామేశం కమిటీ నివేదికను ప్రభుత్వ ఆర్డరును ఖండించవలసినదని ప్రకటించింది. ఆ ప్రకారము బెంగుళూరులో హర్తాలు జరిగింది. సాయంత్రము సభ జరిగింది. యీ ప్రదర్శనాలు వేటిలోనూ కూడా విద్యార్థులు పాల్గొనరాదని విద్యాలయాధికారులు నోటీసులు ప్రకటించారు. మళ్ళీ నిషేధాజ్ఞలు పోరాటము ప్రారంభమయేటట్లున్నది.

## కొచ్చిన్

కొచ్చిన్ సంస్థానములో మహారాజా యొక్క ఆధిపత్యాన సంపూర్ణ బాధ్యతాయుత ప్రభుత్వం యేర్పాటు చేయాలని, కొచ్చిన్ శాసన సభలో ఒక తీర్మానాన్ని కె. అప్పయ్యన్ గారు ప్రతిపాదించనున్నారు.

## కాశ్మీరం

కాశ్మీర సంస్థానంలో ప్రజా ఉద్యమము నడుపుతూ ఉన్న "నేషనల్ కాన్ఫరెన్సు" ప్రతినిధి జి. యం. బక్షి గారు సుభాస్‌బోసుతో సంప్రదించి ఈ ప్రకటన చేశారు.

"కాశ్మీర సంస్థాన ప్రజా పోరాటాన్ని గూర్చి బోసుగారితో మాట్లాడిన పిదప నాలో ఎంతో "ఆశ" కలిగినది. గాంధీ, జవహర్లాలుగార్లతో మాట్లాడ నున్నాను. మా పోరాటానికి కాంగ్రెసు సహాయపడుతుందని నమ్మకము మాకు బాగా వున్నది. మా సంస్థానాధీశుడు బ్రిటీషు ప్రభుత్వానికి అండగా నిలచాడు. తమ యుద్ధ ఏర్పాటులకు ఈ సంస్థానము చాల ముఖ్యమైనదని బ్రిటీషు ప్రభుత్వము తలుస్తూ వున్నది.

"మాది జాతీయ ఉద్యమము. మా సంస్థాన మందలి ప్రజలందరి బలమూ మాకున్నది. యీ నాటికి హిందువులు, సిక్కులు, పీడిత జాతులకు సంబంధించిన వారే 950 మంది జైళ్ళలో మగ్గుతున్నారు. ఇతర ప్రాంతాలనుండి దిగుమతిఅయి బాధ్యత లేకుండా పాలన సాగించే మంత్రి వర్గముయొక్క స్థానములో బాధ్యతాయుత ప్రభుత్వాన్ని ఏర్పాటు చేయాలని మేము కోరుతూంటే, నిర్బంధ విధానాన్ని ప్రయోగించి మా పోరాటాన్ని అణచాలని ప్రభుత్వము పని చేస్తోంది.

## కాల్సియా సంస్థానం

ఈసంస్థానం పంజాబ్ రాష్ట్రంలోనిది. మోగా రైల్వే స్టేషన్‌వద్ద "గాడ్లి" మార్కెట్టును పికెటింగు చేయడంతో ప్రారంభమై 2 నెలలనుండి పోరాటము సాగుతోంది. ప్రజల ఆర్థిక హక్కులను నెరవేర్చి 100 గురు పైగా ఉన్న రాజకీయ ఖైదీలను విడుదల చేయవలసిందని ప్రజలు కోరుతున్నారు. పంజాబులోని బ్రిటిషు యిండియా నుంచి రైతులు వీరికి సహాయము చేయసాగారు. పంజాబు ప్రభుత్వము "స్టేట్సు ప్రొటెక్షన్ ఆక్టును" పంజాబులోని 5 జిల్లాలకు వర్తింపజేసి, బ్రిటిషు ఇండియానుంచి వీరికి సహాయము చేసే వారిని అరెస్టు చేయ సాగింది. అంబాలాలో 25 మంది రైతులు అరెస్టు చేయబడ్డారు. ప్రతి దినమూ 5 గురు పంపున ఈ చట్టాన్ని ధిక్కరిస్తూ సత్యాగ్రహము చేస్తున్నారు.

## తుపాను భీభత్సం

ఈ నెల 24, 25 తేదీలలో వీచిన గాలివానవల్ల ఆంధ్ర దేశములో చాలా గ్రామాలు నష్ట పడ్డాయి. బందరునుండి కాకినాడ వరకు తూర్పు సముద్రతీరాన 30 మైళ్ళ మేరలోనున్న గ్రామాలలో పంటలు మునిగిపోయాయి. యిళ్లు కూలిపోయాయి. ఎందరికో ప్రాణ నష్టము కలిగింది. అసంఖ్యాకమైన పశువులు మరణించాయి—కేవలము బందరులోనే 20 లక్షలు విలువగల ఆస్తి నష్టమయింది. బందరు కోటలో లక్ష ఇరవై వేల వేరుశనగ బస్తాలు నీట గలిశాయి.

కృష్ణా, పశ్చిమ గోదావరి, తూర్పు గోదావరి జిల్లాలలో కోతల రోజులవడమువల్ల, కోసిన చేలల్లో పనలు కొట్టుకు పోయాయి.

చిన్న చిన్న కుప్పలు తేలిపోయాయి. మిగిలిన కుప్పలు కుళ్ళిపోతాయి. కోతలకు సిద్ధంగావున్న చేలన్నీ మునిగిపోయాయి. రైతాంగానికి తీరని నష్టం వాటిల్లినది. రైలు మార్గాలు తెగిపోయాయి. కలకత్తా మెయిలు, రాయచూరు, నాగపూరు మీదుగా వస్తోంది. యీ తుపానువల్ల ఇంచు మించు కోటిన్నర రూపాయల ఆస్తి నష్టం కలిగింది.

రాజోలులో 14 గురు చచ్చిపోయారు. గోదావరిలో లంగరువేసి ఉన్నదే, స్టీమరు ఒకటి మునిగిపోయింది. 1 చచ్చిపోయాడు. సుమారు 20 వేల ఖరీదైన పడవలు మునిగిపోయాయి. బెజవాడలో కోతలకు పోయే కూలీలు 2 రు మరణించారు. ఇంకా వస్తూన్న వివరాలు కొద్దిగానే. కుగ్రామాలలో జరిగిన నష్టం, వివరాలను తెలుసుకొని, దానిని పత్రికలకు, ప్రజలకు, ప్రభుత్వానికి తెలియజేసి, వాటి నివారణకు ప్రజా సంఘాలు పూనుకోవాలి.

నివారణ ప్రయత్నాలు.

స్థానికంగా తుపాను నష్ట నివారణకు సంఘాలు ఏర్పడి సర్వాపురం, గుడివాడలో బాధితులకు కొలదిగా సహాయము చేస్తున్నాయి. డిశెంబరు 5 వ తేదీ గుడివాడలో కృష్ణాజిల్లా కంతకును నష్ట నివారణ సంఘము ఏర్పరచుటకు జిల్లా రైతు సంఘమువారు ఏర్పాట్లు గావించుచున్నారు. ఆంధ్ర దేశ మంతటికి ఒక నివారణ సంఘము యేర్పాటు గావించి ప్రజల నుండి ధనము వసూలు చేయుటకును, ప్రభుత్వపు దృష్టికి తెచ్చి వారు విరివిగా సాయపడు నటుల చేయాలని కోరుచున్నాము.






# ఫ్రెంచి కార్మికుల విప్లవమా? ★ ఫాసిస్టు విద్రోహమా?

ఫ్రాంసు కార్మికుల సమ్మె—ఆంగ్లో ఫ్రెంచి సంభాషణలు—స్పానిష్ ప్రజల తిండి సమస్య—చైనా జపాను యుద్ధం.

అక్టోబరు 1వ తేదీ ప్రపంచ యుద్ధమో జకోస్లావేకియా బలియో అని ప్రపంచమంతా ఆతురతగా వీక్షించింది. ప్రపంచ యుద్ధం తప్పింది. జక్ బలి అయింది. మెచు వెల లయినా కాలేదు. అప్పుడే కొంపలు. కాలిపోవు ... ఇక యుద్ధం లేదు అని చెప్పిన దేశాలే యుద్ధానికి తయారవు తున్నాయి. మ్యూనిక్ ఒప్పందతో శాంతిచేసిన ప్రముఖులయితే మళ్ళా యీ ఆయుధ సన్నాహాలు చేసికొ ఎవరు ఎవరిమీద ఎందెత్తుతారు? ఈ ప్రశ్నలకు ఫ్రాంసు ప్రభువులు అంతరంగికంగా ... శాంతి శాంతి అని పలవరించినం. అక్కర వదిలి అని ఆక్రోశించటం. చివరకు మరో యుద్ధానికి తయారు గావటం.

ఫ్రాంసులో డలడీర్‌ప్రభుత్వంకూడా ఇలాంటి ప్రయత్నాలే కావించింది. కార్మికులు ఆయుధ నిర్మాణానికై ఎక్కువ గంటలు పని చేయాలని ఒక కొత్త డిక్రీ ప్యాస్ చేసింది. ఈ డిక్రీవల్ల ఆయుధ పునర్నిర్మాణం జరిగితే జరగవచ్చు. కానిమళ్ళాప్రపంచమార్కెట్టునుపంచుకొవేందుకు జరిగే యుద్ధాల కోసం, కార్మికులను ఎక్కువ పనిచేసి త్యాగం చేయమంటున్నది బూర్జువా ప్రభుత్వం. కాని కార్మికులు దీని అంతరార్థం గ్రహించారు. తమ హక్కులకై పోరాడ దలచారు. మళ్ళా పారిస్‌లో బ్రహ్మాండమైన సమ్మెలు సాగాయి.

మొదట దెమైన్ వద్ద తుపాకుల ఫ్యాక్టరీలలో సమ్మె ప్రారంభమయింది. 600 మంది సమ్మె చేశారు. వెలెన్సియన్నెస్ కార్మికులు జనరల్ స్ట్రయిక్ కోసం ప్రయత్నింప నారంభించారు. మరునటిరోజున, యజమానులుసమ్మె చేసినందుకుగాను 500 మందిని ఉద్యోగం నుండి ఊడబెరికారు. దానికి సానుభూతిగా 4 వేల మంది సమ్మె చేసి, ఫ్యాక్టరీలను ఆక్రమించారు, డలడీర్ ప్రభుత్వం వీరిని బలవంతాన బయట వేసింది.

ఒకరు వెళ్లాలని చూస్తే మరో 40 వేల మంది సమ్మె చేస్తామని సిండికేటు యూనియనూ ప్రకటించింది. తుపాకి ఫ్యాక్టరీ కార్మికులకు సానుభూతిగా, ఉత్తర కార్మికులు 5 వేల మంది సమ్మెచేసి ఫ్యాక్టరీలను ఆక్రమించుకొన్నారు. ప్రభుత్వం మొబైల్‌గార్డ్సు (పైనికులు) వీరిని బయటికి తరుమ ప్రయత్నించాయి. ప్రభుత్వం గార్డ్సును పంపడం చూసి, కివిని, మెటల్ కార్మిక సంఘ కార్యనిర్వాహక వర్గం 20 వేల మంది సమ్మె చేయాలని నిశ్చయించింది. ఒక గంటవరకు గార్డ్సు ఫోర్ చేయిందలేకపోయారు. కార్మికులు దారికేస్సు (అడ్డు) కట్టివేశారు. సమ్మె రోజు రోజుకూ వృద్ధి పొందింది. 23వ తేదీ నాటికి వెలెన్సియన్నెస్‌లో 20 వేల వరకు కార్మికులు సమ్మె చేసి ఫ్యాక్టరీలను ఆక్రమించు కొన్నారు. 40 ఫ్యాక్టరీలలో ఆక్రమించుకొన్న కార్మికులను గార్డ్సు ... వేశారు.

ఛాంబర్సు యొక్క కామర్సు కమీషనులో కూడ కమ్యూనిస్టులు ఒక తీర్మానం తెచ్చారు, అది పై డిక్రీ లాను వ్యతిరేకిస్తూ తెచ్చించే. అది కూడా 7—8 ఓట్లతో ఒడిపోయింది. ఈవిధముగా సోషలిస్టులు, కమ్యూనిస్టులు వ్యతిరేకించుతూంటే రాడికల్సు మాత్రం ప్రభుత్వాన్ని సమర్థించుచున్నారు.

తుపాకి ఫ్యాక్టరీలో ప్రారంభమయిన సమ్మె క్రమక్రమంగా అన్ని శాఖలకు ప్రాకింది. 15 వేల మైనర్లు సమ్మెచేశారు. 25 వ తేదీ 25 వేల మంది మెటల్, మైనర్ వర్కరులు సమ్మె చేశారు. సమ్మెచేసి ఫ్యాక్టరీలలోనే కూర్చొంటున్నా కార్మికులను తొలగించడానికి వస్తున్న మొబైల్ గార్డ్సును రానీయకుండా రోడ్లమీద కార్మికులు దారికేస్సు కట్టారు. విమానశాఖకు కూడా సమ్మెప్రాకింది. రేనాల్ట్సు ఆనే కర్మాగారాలలో 3 వేల మంది గుర్రాల మీద ఎక్కివచ్చిన సైనికులకు, కార్మికులకు

పబ్లిక్ సర్వీస్‌కు తగను కల్పించరాదని ప్రభుత్వం ఆజ్ఞాపించింది. ఐతేవారందరూ జనరల్ స్ట్రయిక్ చేయడానికి నిర్ణయించబడింది. సోషలిస్టులు డలడీర్‌ను రాజీనామా ఇయ్యమని కోరారు, వెనుకటి ప్రధాని బ్లూమ్ కూడాడలడీర్‌ను రాజీనామా ఇయమని కోరారు.

సమ్మె చేసినందుకుగాను మెటలర్జికల్ కార్మికులను 80 వేల కార్మికులను యజమానులు పనిలో నుండి తొలగించారు. ఒక్కొక్కరే ప్రార్థించితే తప్ప పనిలో పెట్టుకోరట.

ప్రభుత్వం "రిక్విజిషన్" ఆర్డరువల్ల సమ్మెదార్ల సంఖ్య తగ్గిపోతున్నది. కార్మిక నాయకులు కూడా పనిలోకి పోతున్నారు. కాని 30 వ తేదీన మాత్రం జనరల్ స్ట్రయిక్ తప్పదు.

అప్పుడే మిలటరీ ట్రిబ్యునల్ క్రింద 14 గురికి 10 రోజుల ఖైదు విధించారు. ధాన్యశక్తి ప్రభుత్వపు లొంగుబాటు తెలియ జేస్తుంది. రేనాల్డ్సు కర్మాగారాలలో కార్మికులు దారికేస్సు


ఫ్రెంచి విదేశాంగ మంత్రి బోనెట్


ఫ్రెంచి ప్రధాని దలదీర్


బ్రిటిష్ విదేశాంగ మంత్రి హాలిఫాక్సు

ఫ్రెంచి ట్రేడ్ యూనియన్ కార్యదర్శి సమ్మె అన్నిశాఖలకు ప్రాకుతుందని, ప్రభుత్వోద్యోగీయులతో సహా చేస్తారని వార్నింగ్ ఇచ్చాడు. పెట్రోలియం కార్మికులుకూడ సమ్మె చేసి డిపోలను ఆక్రమించారు.

ఇలా ఒకప్రక్క కార్మికులు బ్రహ్మాండమైన ఒత్తిడి తెస్తున్నారు. మరొకప్రక్క ఛాంబర్ ఫైనాన్సు కమిటీలో సోషలిస్టులు ఒక తీర్మానం తెచ్చారు. అది క్రొత్తగా ప్రభుత్వం పెట్టిన ఫైనాన్సు డిక్రీ లా (కార్మికుల పని హెచ్చించి, ఆయుధ నిర్మాణం వృద్ధి చేస్తుంది. లా.)ను వ్యతిరేకిస్తుంది. కాని 18—20 ఓట్లతో—రెండు ఓట్ల భేదంతో ఓడిపోయింది.

కాని రాడికల్ సోషలిస్టులు (నిజానికివీళ్ళని సోషలిస్టులనడము సిగ్గుచేటు — ఇది డలడీరు పక్షమే.) డలడీర్‌లో విశ్వాసాన్ని చూపించేలాంటి తీర్మానం 25–10 ఓట్లతో ప్యాస్ చేసింది.

ఘర్షణ జరిగింది. 12 మందికి గాయాలు తగిలాయి. ఒకని తల బ్రద్దలయింది. కన్ను ఊడిపోయింది.

పరిస్థితులు విషమించిన కొలదీ ప్రభుత్వం కఠిన చర్యల తీసుకొంటున్నది. ఫాసిస్టు దేశాలలోవలె నిరంకుశ ప్రవర్తనకు పాల్పడ సాగినది. రేనాల్డ్సులో 280 మందిని అరెస్టుచేసి కార్మికులను వెళ్ళగొట్టారు. ప్రభుత్వము ఏయుద్ధము వస్తేనో ఉపయోగించ వలసిన చట్టాలన్నీ వుపయోగించు తున్నది. యుద్ధ సమయాలలో అడిగినప్పుడు లాగా రైల్వే కార్మికులందరూ పని చేయాలని "రిక్విజిషన్" పంపింది. దీనికి నోటీసులు సరిగాలేవని కార్మికులు తిరస్కరించారు. ఊరేగింపులు మీటింగులు నిషేధింప బడినాయి. మిలటరీ ఆర్డర్లను వినకపోతే తిరుగబాటు క్రింద లెక్కవేసి, కార్మికులను శిక్షించడానికి మిలటరీ ట్రిబ్యునల్ ఒకటి ఏర్పరచారు.

వస్తువుల తీసుకొని పోలీసులతో పోట్లాడు పనివల్ల చాలా నష్టం వచ్చింది. యజమానులు "లాకౌట్" (మూసివేయడం) ప్రకటించారు.

రేపటి (బుధవారం) సమ్మె పైనవేరిదలడీర్ ప్రభుత్వం ఉండుటా ఊడుటా ఆధారపడుతుంది. ప్రభుత్వం అన్ని విధాల సమ్మెను భగ్నం చేయాలని ప్రయత్నించుతుంది. యుద్ధం వస్తే ప్రకటించే మాదిరి విశేష "ఆర్డరు అవసరమైతే, 1878 లో ప్యాసయిన "స్టేట్ అఫ్‌సీజ్"ను ప్రకటించవచ్చు. అంటే మామూలు ప్రభుత్వమే పోయి మిలటరీ ప్రభుత్వం ఏర్పడవచ్చన్నమాట.

రోజు రోజుకు తెలియవచ్చే సంఘటనల వలన ఫ్రెంచి కార్మికు లన్నిటికీ సిద్ధంగా ఉన్నారని తెలుస్తుంది. రేపు ప్రభుత్వాన్ని ధిక్కరించి సమ్మెచేయడంఅంటే మిలిటరీతుపాకులకు ఎదురు నిలబడటం అన్నమాట. అంటే ఇక్కో

విప్లవం. ఈసన్నాహాన్ని చూచి దలదీర్ లొంగుబాటు మంచిదే. లేకపోతే ఈతిరుగుబాటు ఫ్రెంచి కార్మిక విప్లవానికో, ఫాసిస్టు తిరుగుబాటుకో దారి తీస్తుంది. నేడు దలదీరే ఫాసిస్టుల కనుకూలంగా ఉన్నాడు. కాబట్టి ఫాసిస్టులు అతనికి సాయం చేయవచ్చు. మళ్ళా అంతర్జాతీయ పరిస్థితులలో, ప్రజా స్వామికానికి, ఫాసిస్టులకు మధ్య పరీక్ష ఇది. ఎవరు గెలుస్తారు. ఇది ఫ్రెంచి సోషలిస్టులపై ఆధారపడి ఉంటుంది. మ్యూనిక్ సంధికి సమ్మతించి సోషలిస్టులు ద్రోహం చేశారు. ఈనాడు అట్లు గాకుండా వీరు కమ్యూనిస్టుల తరఫున నిలబడితే, కార్మికుల విజయం తప్పదు. లేక జర్మనీలో సోషల్ డెమాక్రేట్లు చేసినట్లు ద్రోహం చేస్తే ఫ్రాంసును జర్మనీకి పట్టిన గతే పట్టడానికి దోహదమిస్తుంది. నేటి జయాపజయాలు సోషలిస్టు కమ్యూనిస్టుల ఐకమత్యములోనే ఉంది.

## బ్రిటిష్ — ఫ్రెంచి సంభాషణలు

మ్యూనిక్ శాంతిదేవత కప్పుడే ముప్పు వచ్చింది. హిట్లర్ మళ్ళా కాలనీల సమస్య లేవదీశాడు. ఫ్రాంసు బ్రిటన్లలోను, కాలనీల లోను తీవ్రమైన వ్యతిరేకత. జర్మనీకి కాలనీలను తిరిగి ఈయరాదని బయలు దేరింది. ఫ్రాంసులో మితవాదులైన రిపబ్లికన్ ఫెడరేషన్ గ్రూప్ సైతం ఇలాగే తీర్మానించింది. కాలనీల రక్షించుకొనేందుకు, బ్రిటన్ ఫ్రాంసు లోకవిధానం నిర్ణయించుకోవాలని కూడా అడిగింది. ఇలాంటి సమయంలో బ్రిటన్ తాను కాలనీలను తిరిగి యివ్వనని ప్రకటించింది. కాని ఇపుడు హిట్లర్ హాలిఫాక్సుల ప్రయాణం దేనికి? దలదీర్ చాంబర్లేన్ సంభాషణలు దేనికి? కొందరు కాలనీలను తిరిగి ఇవ్వకుండా ఉండటానికే వెళ్లుచున్నారని తలుస్తున్నారు. మరి కొందరు జపాను దాడి సరిహద్దే ఎత్తులు ఆలోచిస్తుందని అంటున్నారు. యూదుల గురించి ఆలోచించడానికని కొందరు పొరబడుతున్నారు. కాని నిజమైన ముఖ్యకారణాలు రెండు. ఒకటి ఫ్రెంచి కాలనీలను కామెరూనులను జర్మనీకి ఇప్పించడానికి. రెండవది స్పెయిన్‌లో రిపబ్లికన్ ప్రభుత్వానికి ద్రోహం చేయడానికి.

చాంబర్లేను, హాలిఫాక్సులు ఫ్రాంసు ప్రవేశించగానే కొందరు "డౌన్ విత్ మ్యూనిక్"అని గోలచేశారు.

ఆంగ్లో ఫ్రెంచి ప్రకటనల ననుసరించి ఇక ముందు రెండు దేశాలు ఒకే విధానం అవలంబిస్తాయట: అంటే ఫాసిస్టు అనుకూల పద్ధతి అన్నమాట: నిదర్శనం కనపడుతూనే ఉన్నది. ఆంగ్లో—జర్మని సంధి తయారు. రిబ్బన్‌ట్రాప్ (జర్మన్ విదేశాంగ మంత్రి) వచ్చి దస్కతు చేయడమే తరువాయి. అంతా తయారయింది. ఈ సంధివల్ల పాతది రష్యా ఫ్రాంసు సంధి భగ్నం కావడం. తర్వాత ఫ్రెంచి—ఇటలీ సంధికి ప్రయత్నిస్తారు. ఈవిధంగా నాల్గు రాజ్యాల ఒడంబడికకు గూడుపుఠాణి ఇది.

ఫ్రాంకో—జర్మని సంధి ద్వారా జర్మనీకి ఇంగ్లండు మైన గల కోపాన్ని తగ్గిస్తుందట ఫ్రాంసు. ఇందుకు ప్రతిఫలంగా, ఆంగ్లో—ఇటాలియన్ పాక్టు ద్వారా ఇటలీకి ఫ్రాంసుపై గల కోపాన్ని తగ్గిస్తుందట బ్రిటన్. ఇలా చిక్కి ఉన్నవి 'చిత్తం. చిత్తం' అంటున్నాయి బ్రిటన్ ఫ్రాంసులు. దలదీరా, డిఫెన్సు మంత్రి. ఏరో హిట్లరును వర్ణించుచున్నాడు. ఆయన కూడా కాలనీల విషయం గాదనే చెబుతున్నాడు. అతడు నాజీ పక్షపాతి అని అందరికీ తెలుసు. కాని అతడు తాను విమానాలు ఎలా పని చేస్తాయో చూడటానికి వెళ్లాడట: ఇతని ప్రయాణానికీ, చాంబర్లేను దలదీర్‌తో బేరం ఆడటానికి సంబంధం లేదని తలపడం పొరబాటు.

జర్మనీని సంతోషపెట్ట దలచుకొన్న బ్రిటన్ సలహా ప్రకారం ఫ్రాంకో—జర్మని సంధికి తలపడి, ఫ్రాంసు ఎందుకు లొంగుతున్నది? ఇందుకు జకోస్లొవేకియా విచ్ఛిన్నమే కారణం.

## జకోస్లొవేకియా గతి

జకోస్లొవేకియా విచ్ఛిన్నతకూ ఫ్రాంసుకూ సంబంధమేమని అడగవచ్చు. కాని సంబంధమున్నది. జక్ డిఫెన్సు లైన్సు అన్నీ జర్మనీకి అప్పజెప్పడం వల్ల ఫ్రాంసు సరిహద్దులలో జర్మన్ సైన్యాలు కూర్చున్నాయి. ఇప్పుడు జర్మన్ బెదరింపుకు లొంగి, జర్మనీతో సంధి చేసుకోడానికి సంసిద్ధపడింది. మ్యూనిక్ ఒడంబడికతో ఒక లొంగుబాటు. ఫ్రాంకో జర్మనీతో మరో లొంగుబాటు, ఫ్రాంసు బ్రిటన్‌ల లొంగుబాటు అలా ఉండండి, జక్ గతి చూడండి.

అనుకున్న దానికంటే ఎక్కువ జకోస్లొవేకియా నష్టపడింది.

**4—12—38 బెజవాడలో**

ఆంధ్రరాష్ట్ర రైతు సంఘం, జమీన్ రైతు సంఘం, రైతు రక్షణ సంఘం, కాంగ్రెసు జమీన్‌రైతు ఉపసంఘముల సంయుక్త సమావేశము జరుగును. పై సంఘముల సభ్యులందరు విచ్చేయ ప్రార్థన.

అధ్యక్షులు.

**ఆంధ్రరాష్ట్ర రైతు సంఘము.**

ఈ మధ్యనే జకోస్లొవేకియా, సబ్ కార్పాతియన్ రుథేనియాలకు, అటానమీ (స్వాతంత్ర్యం) ఈయబడింది. జక్ ఛేంబర్‌లో ప్యాసయింది. ఇక సెనేటులో ప్యాస్ కావడమే ఆలస్యం. ఇలా జక్కొ—స్లొవేకీ జక్ నుండి విడిపోయాయి.

జక్—జర్మని సరిహద్దు సమస్య పూర్తిగా తేలిపోయింది. సరిహద్దుల (కొత్త) లోని 60 గ్రామాలు, 50 వేల ప్రజలుండేవి, జర్మనీకి అర్పణం అయినవి. ఆస్ట్రియా, సైలేషియాలను కల్పడానికి, జకోస్లొవేకియా గుండా రోడ్డు నిర్మించడానికి జర్మని ప్రభుత్వం పూనుకొన్నది. జక్ తల వూపింది. డాన్యూబ్, ఆర్డర్లను కలుపుతూ ఒక కాలువ కూడా త్రవ్వబడుతున్నది. దీనికి జక్ తల [illegible] ఈ విధమైన నిర్మాణాలలో జర్మని కావలసినంత బలం సంపాదించింది. బాల్కన్లోను, యూరప్ ఆగ్నేయ మూలలోను పలుకుబడి సంపాదించింది బ్రిటిష్ సామ్రాజ్య రాజ్యాల చేరువకు (తూర్పు) వస్తున్నది. 1914 లో బెర్లిన్ బాగ్దాద్ దారి యుద్ధం వచ్చింది. ఇపుడు మళ్ళా హిట్లర్ ల సమీపానికి చేరుకొన్నాడు. ఇంకా హిట్లర్ మెమెల్‌ను మ్రింగాలని చూస్తున్నాడు.

ఈ క్రింది లెక్కలు చూస్తే జకోస్లొవేకియా ఆయా దేశాలకు ఎంత పంచిపెట్టిందీ తెలుస్తుంది.

జర్మనీకి:— 10,930 చదరపు మైళ్లు. 3,652,200 మంది మనుష్యులు.

హంగేరికి:— 4,635 చదరపు మైళ్ళు. 1,041,500 మంది మనుష్యులు.

పోలండ్‌కు:— 375 చదరపు మైళ్ళు. 235,400 మంది మనుష్యులు.

వీటితో అనేక ముఖ్యనగరాలను గూడ పోగొట్టుకొంది.

జకోస్లొవేకియా విచ్ఛిన్నమగుటయే గాక, అచటి బూర్జువా ప్రభుత్వం హిట్లర్ ఆజ్ఞానుసారంగా, కమ్యూనిస్టులను, సోషల్ డెమాక్రేటులను అణచ ప్రయత్నిస్తుంది. వీరే చివరి క్షణం దాకా జక్ స్వాతంత్ర్యం నిలబెట్టడానికి తయారైనారు. ఎంత విపరీతం:

## స్పెయిన్‌కు తిండి

హిట్లర్ మాదంతా తూర్పు యూరప్‌పైన ఉంటే ముస్సోలినికి మధ్యధరా సముద్రంమీద స్పెయిన్‌మీద దృష్టి ఉంది. ఈమధ్యనే ఆంగ్లో ఇటాలియన్ పాక్టును సంధి చేసికొన్న బ్రిటన్, ఫ్రాంసును ఒత్తిడి చేసేది మరోవిషయం ఉంది అది స్పెయిన్‌లో విద్రోహులకు బెల్లిగెరెంటు రైట్సు (ఆయుధాలు కొనుక్కొనే హక్కు) ఇవ్వడం. దీని విషయమై నాన్ ఇంటర్వెన్షన్ కమిటీ నిర్ణయమే తుది నిశ్చయమని ఈదేశాలు ప్రకటించినా లోలోన గూడుపుఠాణి అదే. అపుడే ఫ్రాంసుకూడ ఒక విధంగా ఇటలీ, అబిసీనియా జయించడాన్ని ఒప్పుకొంది. ఫ్రాంసు బ్రిటన్లు తమకు ద్రోహం చేస్తారేమోనని భయపడే ఈ మధ్య స్పెయిన్ పాప్యులర్ ఫ్రంటుకు చెందిన వివిధ పక్షాలు 14 ఒక ప్రకటన గావించాయి. "తమ ప్రభుత్వం ప్రజల విశ్వాసం చూరగొన్నది. దేశాన్ని కాపాడ కంకణం గట్టుకొంది. తమ వెనుక జరిగే గూడుపుఠాణీలకు— ఇతర దేశాల ప్రయత్నాలకు లొంగదు. ఎక్కువ సైన్యాలు, ఆయుధాలు నిర్మించి బలం సంపాదించింది."

ఈ ప్రకటన వల్ల ఫ్రాంకోకు ఇతర దేశాలు ఇంకా తీవ్రంగా సహాయం చేస్తేనేగాని గెలవడని తేలిపోయింది.

ఎబ్రో రంగాన జూలై 25 నుంచి నవంబరు 7వ తేదీ వరకు జరిగిన యుద్ధం వల్ల, ఫ్రాంకో ఏమీ జయించలేదు. చివరకు ఎబ్రోను పట్టుకొన్నా అది ఇటాలియన్ల వల్లనే.

నేడు స్పెయిన్‌కు ఎదుర్కొన్న ముఖ్య సమస్య తిండి సమస్య. చలికాలం. తిండి, బట్టలు అవసరం. ఇది గుర్తించే స్పానిష్ వీర యువకులు ఇండియాను కూడా సహాయం చేయమని ప్రార్థించారు. జవహరు ఉద్బోధన చేత బొంబాయిలో ఒక కమిటీ ఏర్పడింది. ఇండియా నుండి ఒక ఆహారపు ఓడ పంపడానికి యత్నాలు జరుగుచున్నాయి. దానికి ప్రజాస్వామ్య ప్రియులందరూ సహాయం గావించాలి. లండన్‌లో కూడ బ్రహ్మాండ యత్నాలు జరుగుచున్నాయి. రష్యన్ కార్మికులు 4820 టన్నుల గోధుమ 1 లక్ష టిన్నుల పాలు, మాంసం, ఇంకా వెన్న పంచదార పంపుతున్నారు.

స్విట్జర్లండ్‌లో ఈ సంవత్సరము పాలు ఎక్కువగా మిగిలిపోయాయి. సోషలిస్టులు ఒక తీర్మానం తెచ్చారు. మిగిలిన పాలను స్పెయిన్ పిల్లలకు పంపాలని. కాని ప్రభుత్వం అంగీకరించలేదు. తమ తటస్థవిధానమే దానికి కారణమని చెప్పారు. ఇప్పుడు పాల ధర తగ్గింది. నష్టపడిచే కన్నా మిగిలిన పాలు స్పెయిన్ పంపమని సోషలిస్టుల గోల, కాని ప్రభుత్వం వినలేదు.

యుద్ధ తీవ్రత ఏమీ తగ్గలేదు. సెగ్రి సెక్టారులో విద్రోహులు జయించారు. 1200 రిపబ్లికనులు పట్టుబడ్డారు. విద్రోహులు బార్సిలోనాపై బాంబులు వేశారు. అందుచేత 51 మంది మరణించారు. 70 మంది గాయపడ్డారు.

ఫ్రెంచి—ఆంగ్లో సంభాషణల ఫలితముగా విద్రోహులకు బెల్లిగెరెంటు రైట్సు ఇవ్వబడేదని తీవ్రంగా బాంబులు కురిపిస్తున్నారు విద్రోహులు.

బ్రిటన్ ఫ్రాన్సులు ద్రోహం చేయకుండా ఆపగలిగేది, బ్రిటిష్ ఫ్రెంచి కార్మికులే, స్పానిష్ ప్రజలకు, పసిపాపలకు తిండి, బట్ట సప్లయిచేసి, యీరెండు లేకపోవడంవల్ల ఓడిపోయారనే నింద ప్రపంచంమీదకు రాకుండా చూడాలసిన బాధ్యత ప్రజాస్వామ్య ప్రియులది. బానిస దేశీయులను మనబోటివారిది.

## చైనా—జపాను యుద్ధం

జపాను కాంటన్‌ను మరల స్వాధీనం చేసుకోవాలని, చైనా సైన్యాలు ప్రయత్నించుతున్నాయి. కాంటన్ పడిపోవడం, యాంగెట్సీ నదిని విదేశీయులకు మూయడం బ్రిటిషు పెట్టుబడిదార్లకు భయం కల్గింది. అమెరికా, బ్రిటన్‌లు యాంగెట్సీని తెరవమని, కోరిన జపాను నిరాకరించింది. ఇప్పుడు బ్రిటిష్ పెట్టుబడిదార్లు రంగూన్ నుండి యూనాన్‌కు, రోడ్డు నిర్మిస్తున్నారు. వీటి వల్ల ఆయుధ సామగ్రి చీనాకు త్వరగా సప్లయి అవుతుంది. రష్యా 6 వేల టన్నుల విమానాలు, ఆయుధాలు, మందు సామాను ఒక ఓడలో పంపింది. అది రంగూన్ వచ్చింది. ఈ దారి గుండానే చైనా చేరుతవి. ఇంకా కొన్ని ఓడలు కూడా వస్తాయట: ఈవిధంగా రష్యా తన ధర్మాన్ని తాను నెరవేర్చుకొంటోంది.

జపాను, పీపింగ్, షాంగై, నాంకింగ్ కాంటను, హాంకోల ఆక్రమణతో ఒక పప్పెట్ (కీలుబొమ్మ) ప్రభుత్వాన్ని స్థాపించ దలచుకొన్నారు.

చైనా కమ్యూనిస్టు పార్టీ మరొకసారి చాంగ్-కై-షేక్‌లో తమ విశ్వాసాన్ని చూపించి యునైటెడ్ ఫ్రంటును కాపాడుతామని వాగ్దానం చేశారు. వెంటనే సోషలిస్టు ప్రభుత్వం చైనాలో నెలకొల్పడం తమ ఉద్దేశ్యం కాదని తెలియజేశారు. కాని సన్‌యట్‌సేనుయొక్క డెమాక్రటిక్ రిపబ్లిక్ సిద్ధాంతాలకు పాటుపడతామన్నారు. ఈ నాడు కమ్యూనిస్టుల సహకారంవల్ల, కమ్యూనిస్టు గొరిల్లా సైన్యాలవల్ల జపాను దాడి అరికట్ట బడుతోంది.

